శ్రీ

శ్రీ శోభనాద్రీశా.

# శ్రీ విచిత్ర భారతము.

(ఐదంకములనాటకము.)

వుయ్యూరుయెస్టేటు ఫారెస్టు రేంజరు

కాళ్ళకూరి హనుమంతరావుగారిచే,

రచియింపఁబడి,






నూజవీడు.

శ్రీ గౌరీముద్రాక్షరశాలయందు,

ముద్రింపఁబడి.

నూజవీడులో నేతద్గ్రంథకర్తగారిచే బ్రకటింపఁబడియె.

1916.

⁂

 [వెల 0-12-0

# ఈ నాటకమునందువచ్చుపాత్రలు.

1 తుల్యమహర్షి.
2 నారదుఁడు.
3 బ్రహ్మ.
4 శివుఁడు.
5 ఇంద్రుడు.
6 ధర్మరాజు.
7 భీముఁడు.
8 అర్జునుఁడు.
9 నకులుఁడు.
10 సహదేవుఁడు.
(6–10: పాండవులు.)
11 చతుర్ధనమహారాజు. (కుండినపురాధీశ్వరుఁడు)
12 ధృతరాష్ట్రుడు.
13 భీష్మాచార్యులు.
14 దుర్యోధనుఁడు.
15 దుశ్శాసనుఁడు.
16 కర్ణుఁడు.
17 శకుని.
18 ద్రోణాచార్యులు.
19 కృపాచార్యులు.
20 అశ్వద్ధామ.
(12–20: కౌరవులు.)
21 కృష్ణుఁడు.
22 బలరాముఁడు.
23 అక్రూరుఁడు.
24 సాత్యకి.
25 ప్రద్యుమ్నుఁడు.
(21–25: యాదవులు.)

స్త్రీలు.

1 రంభ. (దేవవేశ్య.)
2 కమల. (చతుర్ధనునిపట్టమహిషి.)

# PREFACE.



కవిసోదరులారా!

ఆంధ్రకవి చరిగొండధర్మన రచించిన చిత్రభారతమునుండి యీకథ గ్రహించి, ప్రదర్శనానుకూలముగా వలయుమార్పులఁజేసి, యీనాటకము వ్రాసి, కవితాధురంధరులును శ్రీపుయ్యూరు మేడూరు నిడదవోలు పరగణా పట్టభద్రులునగు శ్రీశ్రీరాజా వెంకటాద్రిఅప్పారావు బహద్దరు జమీందారువారికిఁ గడచిన సంవత్సరము, దశహరోత్సవసభలోఁ గృతినిచ్చి ధన్యుండనైతి. శ్రీవారతి సరసులగుటం జేసియు, ముఖ్యముగాఁ దాము బహుగ్రంథనిర్మాతలగు కవీశ్వరులగుటచేతను నన్ననేకవిధంబుల గౌరవించినందులకే నపరిమితానంద వారినిధినోలలాఁడి, సరస సద్గుణగరిష్ఠుని చేపట్టి తానేగాక నన్నుంగూడ ధన్యాత్ముంజేసిన, నాకవితాకుమారి యనుపమానమహాభాగ్యంబును వేనోళ్లంబొగడి, శ్రీవారికనేక వందనంబులొనర్చి, పుత్రపౌత్రదీర్ఘాయురారోగ్యైశ్వర్యాభివృద్ధులనొసంగ శ్రీశోభనాద్రీశ్వరుని వేఁడుచు బాల్యంబున రచించిన గ్రంథమగుటఁ జేసియుఁ గార్యాంతరములం బట్టి చూచుటకుఁ దీరికలేకపోవుటవలనను, లేఖకుని పొరపాటుచేతను, ముద్రణమువలననుఁ గలిగిన దోషంబులఁ బునర్ముద్రణంబున సవరించుకొందునని విన్నవించుచు నింతటితో విరమించుచున్నాఁడను.

ఇట్లు గ్రంథకర్త;
కొల్లకూరి హనుమంతరావు.

శ్రీశోభనాద్రీశా.

# కృత్యాది.

ఉ. ఏది? సగుణంబునిర్గుణమహీనమచింత్యమరూపమద్భుతం
బేది? పరతత్త్వమాగమముసృష్టిలయస్థితనిత్యకారణం
బేది? నిరవద్యముజ్జ్వలముహృద్యమునిర్మలమాత్మసంస్థితం
బదిపరమాత్మప్రోచుననయంబునయూరుధరావనీంద్రునిన్.

సీ. శ్రీరాజరంగయప్పారాయభూపాల
    ప్రాచీనబర్హిస్తపఃఫలంబు
శ్రీచెల్లయమ్మరాజ్ఞీభద్రగర్భము
    క్తాస్ఫోటవిశదముక్తాఫలంబు
కపిలేశ్వరాధీశగర్భసుధాంబోధి
    సంపూర్ణరాకానిశాకరుండు
రామయాంబారమారామామనఃపంక
    జామోదకరసహస్రాంశుమూర్తి

గీ. యప్పరాయాన్వవాయసుధాంబురాశి
పూర్ణశశధరుండుయూర్యరుభూవరుండు
వేంకటాద్ర్యప్పరాయకవీశ్వరుండు
నీకుఁబతియయ్యెనాకపితాకుమారి!

మ. ధనదాజ్ఞాదిదధీచికర్ణశిబిదుగ్ధాంభోనిధీటాత్మదు
ఘ్నునమంద్వారప్రధావతీరణసమాఖ్యాంచద్వదాన్యుండుపా
వనచారిత్రుఁడుపూర్ణయౌవనుఁడుసైవాత్స్యుండునీభర్త, నో
చిననోముల్సమకూరెఁబుణ్యముఫలించెంగావ్యకన్యాత్మజా.

మ. జనకుండెంతటిచిన్నవాఁడయినసజ్ఞానుండె? సంపూర్ణయౌ
వనియైయింటఁజెలంగుకూఁతునకునుద్వాహంబుఁగావించఁడం
చనురవ్వంబడకుండఁగాస్వయముగానాత్మేశుఁగావేంకటా
ద్రినరేంద్రోత్తమునేవరించితివి? పుత్రీ! యింకనాకేమొకో?

సీ. నిమ్మకాయలఁదెచ్చినిలుపఁజాలినమీస
కట్టుతోఁబావటజుట్టుతోఁడ
వజ్రకాంతిస్వంబుఁబరిహసింపఁగఁజాలు
మేనితోఁగానసైనకానుతోఁడ
పుడమినిగడగడవడఁకించుదృఢమైన
యడుగుతోఁబెడఁగైననుడువుతోఁడ
పలువిప్పమొలకనవ్వులవెన్నెలలఁగాయు
మోముతోఁమురిపెంపుగోముతోఁడ

గీ. నవనివర్ధిల్లుశ్రీవెంకటాద్రినృపున
కలరిసాలంకృతంపుకన్యాప్రదాన
మిచ్చితినినాబరువుఁదీరెనింకమీఁద
ఖ్యాతిదెమ్మిత్రద్వరకునన్నుఁగన్నతల్లి?

శా. తల్లీ? నాకవితాకుమారి? వినుమా? ధన్యాత్మవైతీవు, నా
యుల్లంబందునఁగోర్కెతీర్చెనిఁకనీవుత్సాహివై, విన్నవా
రెల్లన్ రంజిలుకీర్తిఁదెచ్చుకొనివిద్యోల్లిద్ధరాజానితో
నుల్లాసంబునధాత్రిపైవెలయుమా? యుద్యత్కవీంద్రస్తుతిన్.

గీ. వినుతకవితిలకుండైనవెంకటాద్రి
యప్పరాయమహీశుగర్భాంబురాశి
ప్రబలియుప్పొంగుచునునిత్యవైభవముల
ధరణివెలయుతనాచంద్రతారకముగ.

గీ. అవనిఁబండితకవిదరిద్రాంధకార
మడఁచినిర్మలకకుబంతయశముఁగాంచి
కృతులనందిమహాభోగమతులరాజ్య
మలరరాజిల్లువెంకటాద్ర్యప్పరాయ.

క. అనిశముసంతానోదయ
మనిశముమంగళయుతంబులగు కార్యంబుల్
తనరఁగమముఁబాలింపుము
అనవరతశ్రీల వెంకటాద్రినరేంద్రా!

ఇట్లువిధేయుఁడు,
కాళ్ళకూరి హనుమంతరావు.



శ్రీ

# విచిత్ర భారతము.

(నాంది)

శ్రీరంజిల్లఁగ నింద్రపుత్రుఁ డేకధాత్రీనాథుఁ జేపట్టి, దు
ర్వారంబౌ, ఘనమౌ, సుదర్శనముచేఁ బాండవ్యులం జంపి, జం
భారిస్థానము విరించనుల్ పొగడ, లబ్ధప్రాణులం జేసి, వి
స్తారంబౌ కృప నేలు కృష్ణుఁడిడుఁ గాతన్మీకు భద్రంబులన్.

(నాంద్యంతమున)

(నటీ సూత్రధారులు ప్రవేశించుచున్నారు.)

నటి—ప్రాణనాథా! నేఁడేమి? చిత్రము?

సూత్ర-చిత్రమున కేమున్నది?

నటి—ఈదినంబున సభ్యులందరిచ్చోటఁ గూడుటకుఁ గారణం బేమి?

సూత్ర-నేఁడిచ్చట విచిత్ర భారతంబను నాటకంబు చిత్రంబుగాఁ బ్రదర్శింపఁబడును.

నటి—విచిత్రభారతంబన నెద్ది?

సూత్ర-కుండిన పురాధీశ్వరుండగు చతుర్ధనువలనఁ బాండవులకును, శ్రీకృష్ణునకునుఁ జరి
గిన యుద్ధకథ.

నటి—ఇహపరసాధనంబై, మోదజనకంబై, నూతనంబైన యీదృశ్యప్రబంధంబు నెవ్వ
రరచించిరి?

సూత్ర-చెప్పెద వినుము.

మ. ఘనులెల్లం గొనియాఁడ ముద్దులొలుకంగా మున్న సౌగంధికం
బను కౌంతేయుల సచ్చరిత్ర నతి బాల్యంబందుఁ గల్పించె; స
ద్వినుతుండౌ హనుమంతరావతఁడె యీదృశ్యప్రబంధంబు పా
వనచారిత్ర విచిత్రభారతముగా వ్రాసెం జుమీ! భామినీ.

నటి—అట్లనా!

సూత్ర-కాలంబుమించుచున్నది. నాకు నిలుచుటకు తీరికలేదు. ముద్దులుమూటఁ గట్టునట్లొక్క పాటఁ బాడుము.

నటి—(నవ్వుచు) చాలుఁ చాలు. నాపాటయే మీకుఁగావలసివచ్చెనా? అట్లయినను నన్నేమిపాడుమని యెదరు?

సూత్ర-అద్భుతంబగు నీశరదృతువర్ణనం బొనర్పుము. చాలును.

నటి—అట్లనేపాడెద.

ఉ. చల్లనిగాలివీచె, దివిఁజంద్రుఁడు వెన్నెలఁగాచెఁ, గోకిలల్
పెల్లుగఁగూయవచ్చెనళిబృందముఝుంకృతిసల్పఁజొచ్చెఁ జె
ల్లల్లెనుఁగోరకావళులనింపుగఁదాల్చె, మరుండులేచె, నో
వల్లభ! యీశరదృతువునైభవముంగొనియాఁడశక్యమే?

మఱియు,

చ. సలలితమందమారుతముచల్లఁగవీవఁదొడంగెఁ, బుచ్చపు
వ్వ్వులవలెఁబండువెన్నెలలుభూమిపయింబొలుపారె, మిన్నుని
ర్మలమయిదిక్సతీమణికరస్థగితామలదర్పణంబునాఁ
బొలిచెను, రెల్లుపూచెయమపుత్రయశోవిభవంబుచాడ్పునన్,

సూత్ర-భవదీయామూన గానవిలాసంబులకు, నేనేగాక నీసభికులెల్లనుఁ గడుసంత సించిరి.

నటి—మీకాలస్యమగుచున్నది. నేనుపోయివచ్చెద!

సూత్ర-మంచిది.

నటి—(నిష్క్రమించుచున్నది.)

సూత్ర-సభ్యులకొక విజ్ఞాపనఁజేసి నేనుఁగూడ వచ్చుచున్నాఁడ!

ఉ. వచ్చియురానిపలుక్కులనుఁబలెక్కుడుబిడ్డనుఁదండ్రియెట్టు తా
ముచ్చటమీరముద్దిడుచు మోదముతోఁ బలికించిమెచ్చునా
మచ్చుగనస్మదుక్తులనుమన్ననఁజేసికృపారసంబుతో
నిచ్చలుఁదప్పులున్నఁగరుణింపఁగవేఁడెద, ధీరబృందమా!

(నిష్క్రమించుచున్నాఁడు.)



శ్రీహయగ్రీవాయనమః.

# విచిత్ర భారతము.



## ప్రథమాంకము.

(భాగీరథీతీరంబునఁ దుల్యమహర్షి తపంబుసేయుచుండగా రంభప్రవేశించుచున్నది.)

రంభ—(ఆశ్చర్యముగాఁదనలో) ఆహా! మహేంద్రుని సభామంటపంబున ఋషీంద్రులెల్లరు నెవ్వెరపడ, వియచ్చరులు నుడివిన వర్ణనకుఁ దార్కాణమై; త్రిమూర్తులు నింద్రాదిదిక్పాలురును, గరుడ గంధర్వ యక్షకింపురుషసిద్ధసాధ్యవిద్యాధరాదులును నుతింపఁ బంచాగ్ని మధ్యంబుననుఁ గంఠదఘ్న నీరంబుల యందును, ఋతువులకుం జంకక, నేకాగ్ర చిత్తంబునఁ గందొగలు నిమీలితంబులై యుండఁ గరపద్మంబు లూరులం జేర్చి, యింద్రియ బలంబడంచి, శ్రీమన్నారాయణ పరంజ్యోతిని హృత్కమలంబుననిల్పి, స్వస్తికాసనాదుల నేఁడువేలేండ్ల నుండి దివ్యయోగ సమాధివీఁడకఁ దపోబలంబున ముల్లోకంబులు భస్మీభూతంబు సేయఁజొచ్చిన మహర్షియగు తుల్యుండితండే కాఁబోలును! ఆహా.

ఉ. చూచితిఁదాపసోత్తములఁజూచితివారితపంబునిష్ఠలున్
జూచితి, సర్వలోకములఁజూచినవారలనెల్లబుట్టలో
వైచితిఁ జెంతదాసులయివారిలఁగ, నింతటివానినెన్నఁడున్
జూచియెఱుంగభీతిమదిఁజొప్పడుచున్నదినాశహేతువై.

త్రిమూర్తులుండఁ దనకేలయని యూరకొనకఁ బెద్దరికంబువెలుఁగ బెట్టుకొనియీతని తపోభంగంబున కెన్నిచెప్పినను వినక, నీవేతగినదానవని యుబ్బవైచి, యింద్రుఁడు నన్నుఁబంపె. ఈమునిశార్దూలముం గాంచినతోఁడనే నాయొడలు గడగడ వడంకుచుండ నీతనికడ కడుగిడుటెట్లు? (ఆలోచించుచు) ఏమి? ఈయశుభసూచకంబులు?

క. కుడికన్నదరెడిసురపతి
బెడిదఁపుఁగార్యంబుపైనఁబెట్టెను, గతియే
వడువుననుండెనొకో? చి
చ్చొడిఁగట్టఁగఁబూనివచ్చియుంటిఁదలంపన్.

మునీంద్రులలోనెల్ల నీతండు చండకోపనుండని వింటిని.

శా. నిక్కంబీఋషిపావకుండలిఁగినన్ నీరౌనులోకంబులే
నిక్కార్యంబెటుచక్కఁబెట్టఁగలనో? యింద్రామతేమందురో!
ప్రక్కంజేరినఁబిల్చునో? పిలువఁడో? వ్యాపాదమే మెంచునో?
ఉక్కీఁడై శపియింప నెమ్మనములో నూఁకించునో దైవమా?

(అనివిచారించుచు) కాసిమ్మ త్రిలోచను నైనంగలంపఁజాలు మన్మథుండు వసంతాదులతోఁ గూడి నాకుఁదోడై యుండెనుగదా? (తలయూచుచు) ఉండిననీ మహామునినెట్లుసాధించి నా ప్రతిజ్ఞ నిలుపుకొందును?

సీ. అతిభోగియనివక్కలాకులందిత్తునా!
భోగవిరక్తుఁడౌజోగియితఁడు
గానమిష్టమటంచుఁగానంబుసేతునా!
ధ్యానియౌవానికిఁగానమేల!
ముద్దుముచ్చటలతోమురిపింతునందునా!
మునుపటిముక్కాలిముసలియితఁడు
కాముఁడున్నాఁడంచుఁగౌఁగిటనుంతునా!
యట్టిసరసుఁడు కాఁడనితలంతు?

గీ. మొదటతొందరఁబడినచో మోసమేమొ?
యప్సరసలందుననుమెచ్చియాదరించి
విదితకీర్తివినీవెచాలుదువటంచు
నింద్రుడంపెనాతనిరుణంబెట్లుతీర్తు.

ఎన్నివిధంబుల నాలోచించిచూచినను, నాకేమియుఁ దోచకున్నది. సాహసించిచూచెద. తరువాత దైవేచ్ఛ యెట్లున్నదో యట్లుజరుఁగక మానదు. పంచబాణా! నీయస్త్రలాఘవంబు నూపుము. నీబలంబులం బురికొల్పుము. వసంతా! కడుజాగ్రత్త! (అనిదగ్గరకేగి నృత్యంబొనర్చి) మునీంద్రా! నమస్కారము. (అనిమ్రొక్కిలేచి) ఏమి! ఈతని నిశ్చల నిష్ఠాగరిష్ఠత్వము.

చ. చక్కఁగఁజేతులన్మొగిచిసాగిలిమ్రొక్కినఁజూఁడఁడాయెఁ? బె
న్మక్కువతోపఁబిల్చినను మారుజవాబిడఁడాయెఁ? గూర్మితోఁ
జెక్కిలినొక్కఁడాయెఁ? వనసీమలయోగసమాధిరేబవల్
ముక్కులుమూసికొన్నమునిమ్రుచ్చులకేల? రతిప్రసంగముల్.

తుల్య-(ఆశ్చర్యముగాఁ జూచుచున్నాఁడు.)

రంభ--(ఆశ్చర్యముతో) ఈతుల్యుండు సాక్షాద్విష్ణు తుల్యుండుకాని వేరుకాదు. తే కున్న.

ఉ. కచ్చబిగించియాకులనుఁగాయల దుంపలఁదించుఁగానలన్
ముచ్చముడుంగుతాపసులుమోహమునొందరొ? పేరువిన్నచోఁ
గ్రచ్చర వెంటవెంటఁబడికౌఁగిలికింబ్రతిమాలకుందురో!
యచ్చెరువయ్యెనీతనిమహత్త్వము, నింద్రియనిగ్రహత్వమున్.

(అనిచింతించుచున్నది.)

తుల్య-(లేచియాశ్చర్యంబుతో) ఈనిర్మానుష్య కాంతారంబునఁ దనతేజంబునఁ గన్నులపండువుగా నొనర్చు నీభువనమోహిని యెవ్వతెయై యుండనోపు? (చెంతకేఁగిచూచుచు)

సీ. నొక్కునొక్కులుఁదేరినొసటఁదుమ్మెదరెక్క
లనుమించుముంగురులనువుమీర
వరగులాబీపూవువన్నెఁగల్గినముద్దు
చెక్కుటద్దంబులచెలువుతోఁడ
నందంబునకుఁగొత్తసౌందర్యముంగూర్చు
డంబుమీరెడియాననంబుతోఁడ
పయ్యెదలోఁజిక్కువడిగుబ్బజక్కవ
ల్పొంకంబుమీరదోబూచులాఁడ

గీ. కులుకునవ్వులులేఁతవెన్నెలలఁగాయ
గజ్జెలందెలుమ్రోయమీఁగాళ్ళమీఁదఁ
జీరకుచ్చెళ్ళుల్ సూళ్ళతోఁజిందులాఁడ
నిచటఁదిరుగాఁడుబిత్తరియెవ్వరొక్కొ?

(చెప్పవాల్పకఁజూచుచు)

ఉ. ఆనగు మోము నెన్న డమెయోయారములా? ముకి పెంపునవ్వులా
హా? నెఱనీటులా? సొబఁగులా! నునుబంగరు మేనికాంతులా
రా? నిపుణత్వమా? కనులయందములా? నిడువాలుఁజూపులా!
చానకె? యుండఁగాఁదగునిజంబగుబుద్ధిఁదలంచిచూచినన్.

అహా? ఏమిది?

శా. లోకంబందుననేక రూపవతులాలోలాక్షులున్నారు, వా
రీకంజాక్షికిసాటియే; కనులతోనీక్షించినన్ దర్పకుం
డాకంపించుచు వెంటనంటఁడె విమోహాయత్తచిత్తంబుతోఁ
నీకంజాక్షి నిధాతయెట్లుభువిలోసృష్టించె? నిక్కంబుగాన్.

అహా! ఏమి దీని సౌందర్యము. నావంటి విరాగులే సరాగులై చలించుచుంటే సంకఁబరులెంత?

రంభ—(చూచితనలోనవ్వుచు) అహా! పంచాయుధ ప్రముఖులారా? రండు. రండు. నామనోరథంబిఁ జేరనది.

ఉ. చేతముఖీతిలన్ వెతలఁజెందితిఁగాని మునీంద్రుఁడింకనా
చేతికిఁజిక్కె నేనితని చేవనుఁజూచితి, నొక్కముద్దుతోఁ
బ్రీతునిఁజేసియింకనడిపించెద నిష్ఠతపంబులన్ సుర
వ్రాతమునంతసింపఁగ దివస్పతి మెచ్చుచుఁగాఁగలియ్యఁగాన్.

(చేరఁబోయి.)

స్రగ్విణీవృత్తము.—

వందనంబుగ్రహాపాటపీదాహకా!
వందనంబు త్తమస్వర్ణశోభాకృతీ!
వందనంబింద్రసంభావనా! పావనా!
వందనంబార్య! విద్వన్నుతా! యందుమా?

(అనినమస్కరించుచున్నది.)

తుబ్బ—(ఆశ్చర్యముతోఁజూచి.)

ఉ. ఎవ్వతె? వారు? యిచ్చటికినేటికివచ్చితి! వెద్దియూరు? నీ
మవ్వఁపుజవ్వనంబనుపమానము, కాననలక్ష్మిభంగినీ
విప్వి పినంబునందుఁజరియించెదుకష్టము లేలవచ్చెనో
జవ్వని? నాకుఁదెల్పుమిఁకసాంతముగావినఁగోరుచెంతయున్.

రంభ—(చిఱునగవుతో)

సీ. కలుముల చెలిమిన్న పాలుపారఁబుట్టిన
పాలేరుపుట్టిల్లువరగుణాఢ్య
సరసాభినయనృత్యసంగీతశాస్త్రము
ల్నాకుఁబెట్టినపేరులోకవంద్య
విలుకాఁడుఁడై నట్టివిషమాస్త్రిక్రీడలు
కులశీలములుమాకుగురుయశస్వి
బ్రహ్మవిష్ణుమహేశవాసవసభలెల్ల
రచ్చపట్టులుమాకుసచ్చరిత్ర

గీ. అఖిలలోకంబులందుమాకడ్డులేదు
మేనకాద్యప్సరసలుమాప్రాణసఖులు
స్వర్గలోకంబుమాకునివాసభూమి
పౌరిధురాలనునాపేరురంభయంద్రు.

స్వచ్ఛంద విమానారూఢనైపోవుచు జగద్విదిత పుణ్యమూర్తులగు తమదర్శనంబువడసి యరుగవలెనని వచ్చితిని.

తుల్యు-(తనలో) ఎందరో మునుల కొంపలందీసిన దేవలోక సువాసినియగు రంభవా? ఎవ్వరోయనుకొంటిని? ఇంకనీమాయలాఁడిని సత్వరంబుగా సాగనంపకపోయిననాకు ముప్పువచ్చును. (ప్రకాశముగా) వేశ్యామణీ! చాలసంతసంబయ్యెడి. నీకు నాయందుఁగల భక్తికిఁ జాలమెచ్చవచ్చెడి. నీవాంఛితం బెయ్యది!

రంభ—(దీనముగా) మునిచంద్రా! అభయప్రదానము.

తుల్యు-సుందరాంగీ! నీభీతికింగారణమేమి?

రంభ—(భయంబభినయించుచు) రూపుమాసినను నెక్కడఁజూచినఁ దానైయై, కన్నుల నిప్పులురాల మండిపడుచు, రాచిల్కగండునెక్కి, పుష్పశరాసన గుణంబు సారించుచు సవ్యసాచియై, యుద్వృత్తుగాఁ బ్రయోగించు నరవిందాస్త్రంబునకు గుండెఝల్లుమనఁ జూతశరంబునకుఁ బెద్దయుఁ బొరిద్దుదూరపిల్లి, యశోకసాయకంబున కొడలెరుంగక, నవమల్లికా శుగంబునకు మూర్ఛిలి, నీలోత్పలవిషవిశిఖంబునకుఁ బ్రతుకుదెరవుంగానక మీపాలఁబడితి. శరణాగతత్రాణము శ్రోత్రియోదాయకంబుకదా.

తుల్యు—కోమలీ? ఎవ్వఁడు?

రంభ—(దీనముతో) యువతీజనభీకరుండగు కుసుమసాయకుండు.

తుల్యు—హరహరా (చెవులుమూసుకొనుచున్నాఁడు.)

రంభ—అయ్యో?

క. అరసావొనర్చి, నిప్పులు
వరచినగతిఁదనువుభగ్గుభగ్గుమనఁగఁబై
గురియుసు నిశితములగునా
స్మరుపుష్పాస్త్రములకోర్వఁజాలమునీంద్రా!

(అనిమూర్ఛిల్లి లేచుచున్నది.)

తుల్యు-(నవ్వుచు) ఏమి! ఈపోకిళ్లు! (అన్నితలయూఁచుచు) సామవచనంబుల నూరడించి పంపెదఁగాక! కోమలీ?

సీ. ఈపెద్దజడచుట్టలీపుట్టగోఁచులు
శంపాలతాంగులకింపులగునె?
యిట్టిబూడిదపూతలీ యేహ్యరూపంబు
పడఁతులకెంచకన్పండువగునె?
యీనెరసినమీసలీపెద్దగడ్డంబు
లంబుజాతాక్షులకందమగునె?
యీవనవాసంబులీతపోనిష్ఠలు
కామినీమణులకుఁబ్రేమయగునె!

గీ. ఐహికాపేక్షవిడచిగుహాంతరముల
రేపునేఁడంచునుండినతాపసులకు
భోగమేలను? మీఁయనురాగమేల
సరసమేలమీయాశ్లేషసౌఖ్యమేల?

రంభ—మునితల్లజా! వలపునకుఁ జిన్నపెద్ద తారతమ్య మ్మెుండునా? ఆనందంబే కారణంబు.

తుల్యు-ముదితా!

మ. నిరయోద్యోగము, పాపహేతువు, తపోనిర్మూలనంబస్థిరం
బురుదుర్మార్గవిచారకారణము, శ్రేయోదారకీర్తిబహి
ష్కరణంబుత్కలికాధిమూలమతినీచంబట్టివారాంగనా
సురతక్రీడలుమానికేలచెపుమా! శుభ్రాంశుబింబాననా!

అదియటుండగాక—

శా. హింసంజేయకనెల్లవేళలనుసర్వేశున్మదిన్నమ్మియున్
సంసారంబులురోసి, కాఁడవులన్సౌఖ్యంబులన్బాసి, మేన్
మాంసంబెల్లహరింపనాకునలమున్భక్షించు, మౌనీంద్రువి
ధ్వంసంబైనశరీరమేపగిఁదివ్యాద్యంబౌను! కాంతామణీ?

రంభ—అయ్యో? మునివరా? జాలమేల?

తురఁగవల్లభ. వినుముకోరివచ్చినట్టివెలఁదికోర్కెఁదీర్పకుంట
జనునొకో? ఘనంబొకో? సరసమునెఱుంగవేమనందు
మునివరా! సతీరతిసుఖమునకుమించుభోగమున్నె!
తనివిఁదీరసౌఖ్యఁపడుముతలఁచుకొమ్ముచెప్పుచుంటి.

తుల్య-మానిని (నిశ్చయహఁదెల్పుటఱునగవుతో)
చాలుచాలునుమానినిచెప్పకుసాటెకుడుచ్చసుఖంబునకై
లాలితనిష్ఠతపంబులువీడఁదలంచినబేలలుఁగల్గుదురే?

రంభ—(దగ్గరకేగి, మందహాసముతో) మునీశ్వరా?
"ఏలిటులాడఁగమీతలదాటుమునీంద్రులు గాధిసుతాదులుమున్
లాలనతోమముఁగూడరె? వారికిలన్జెడిపోయినచెద్దియెకో?

తుల్య-మత్తకాశినీ! ఏమీ! నీసీతివాక్యములు? వారికి బహుకాలార్జితంబగు తపోబ
లంబుచెడలేదా!

రంభ—(చేతులుమోడ్చి) మహర్షిచంద్రమా! ఈతపంబులీజపంబులీనిష్ఠలెందుకో
కోచెప్పి దాసురాలిని మన్నింతురుగాక!

తుల్య-అమలంబై, యతిసుస్థిరంబై, నిరంతరామోద కారణంబై, యద్వితీయంబై
యాద్యంత శూన్యంబైన దివ్యసుఖంబుకొరకు.

రంభ—మంచిది. దివ్యసుఖంబనసెద్ది?

తుల్య-స్వర్గసౌఖ్యము,

రంభ—(చిఱునవ్వునవ్వుచు) తాపసోత్తమా! ఎంతవెఱ్ఱివాఁడవు?

ఉ. కుందుచు రేవగళ్లలను ఘోరతపంబులు, యజ్ఞయాగముల్
పొందుగఁ జేసియేపడఁతిపొందున కెప్పుడుఁ గోరుచుందురా
సుందరిముమ్మరంపుఁదమిసొక్కుచుఁ బైఁబడఁ గోరుచుండఁగా
సందియమంద నేల! మదిసంయమిచంద్రమ! కౌఁగలీయుమాఁ!

తుల్యమునీశ్వరా!

సీ. యజ్ఞంబులనుఁ జేసియవయుటఁ జూడనా
యధరబింబామృతమానఁగాదె?
క్రతుకర్మములనెల్లఁ గావించుటరయనా
కుచదుర్గములనిద్రఁ గోరికాదె?
హోమాగ్నివేల్చుచునుపవసించుటలునా
పొలయల్కకౌకలఁ గులుకఁగాదె?
విపినావళిం జేరితపియించుటెల్లనా
కౌఁగిఁటసౌఖ్యంబుఁ గాంచఁగాదె

గీ. స్వర్గసౌఖ్యంబులొసఁగెడిచాన నేనె
చేరురణశూరులకు నెల్లదారి నేనె
నన్నుఁగాదనసౌఖ్యంబునున్న సుమ్మ
స్వర్గకాంక్షితులకు నెల్లసంయమీంద్ర!

తుల్య-అట్లనా!

రంభ—అట్లుగాక.

ఉ. చచ్చినపైనస్వర్గపురసౌఖ్యమెవచ్చునొ? కాలమాత్రమే
వచ్చునొ! స్వర్గమిత్తుననివ్రాసె నెనీముఖమందుబ్రహ్మ! యీ
పిచ్చనుమాని, నాయధరబింబసుధారసమాననిఁక రా
వచ్చును నిష్ఫలంబడయవచ్చును లెమ్మికరమ్ము. తాపసా!

వాచంయమీశ్వరా!

చ. వనులతపించుచెండలను, వానలఁగుందుచుఁగావిగోఁచులన్
ఘనతధరించి, వేఁగి, తుదిఁగాయముపోయినపైనవచ్చునా
వినుతసుఖంబుసేకురిన, వీడఁగనెంచెదవేల? కోరివ
చ్చినసతిఁజుల్కఁజేసితపసీ! యిదిమీామగవారినైజమూ?

తుల్య-(తనలో) ఆహా! ఈబోఁగఁపుబోఁటి ధర్మశాస్త్రోపన్యాసంబులు, వినవినఁజెవులకు ములుకులవలెనున్నవి. (ప్రకాశముగా) సుందరీ? త్రిలోకంబుల మోహింపఁజాలు, జయంత, వసంతనలకూబరాదులుండ, శల్యావశిష్టుఁడనై, లేవసత్తువలేని ముసలితపసితోడనా? నీసడసంబులు.

రంభ—(నవ్వుచు) తమరెఱుంగని ధర్మమేమున్నది?

తుల్య-(నవ్వుచుఁదనలో) ఏమి? అపవర్గసౌఖ్యంబులకెల్ల తానేమూలమని వాఁగుచున్న యీావెర్రిసాని యాత్మస్తుతికేమనఁ గలవాఁడను? (అనినవ్వుకొనుచున్నాఁడు.)

రంభ—(తనలో) నాకోరిక నెరవేరు నట్లున్నది. ఈవెడఁగుఁదపసి నాకపట మోహవాగురులంజిక్కి సోలుచున్నాఁడు. ఈతనికిప్పుడు దూరముగానిలచిచెప్పినలాభములేదు. (మోహంబభినయించుచు)

మత్త--మారుకూ్రరశరాళివేఁడిమి? మాఁడుచున్నదిదేహమిం
పారఁజూఁడుమునాకుచద్వయమయ్యయో? యెటుకా్రఁగెడున్
బారసాచియుఁగాఁగలింపుముభా్రంతిఁదీర్పుముతాళఁగా
నేరఁబా్రణమునిల్పఁజాలమునీంద్ర! సత్కృపఁగావుమా?

సీ. చెల్లెలిక్రొంపఁదీసినకృతఘ్నుఁడుబరా
బరులవెన్నెలచిచ్చుఁగురియుచుండ
చలచిత్తుఁడగుమందమలయానిలుఁడుముందు
పుప్పొడిగాడ్పులఁగుప్పుచుండ
దుర్మార్గుఁడగువసంతుఁడుచెలరేఁగినై
న్యంబులతోహాళాహాళినొసర్ప
పికశంఖరవముహృద్వ్యధిభేదింపఁగ
రాచిల్కగండుగుట్టంబునెక్కి

ఆ. మొగలిరేఁకుబాఁకునొగినూరిపంచాస్త్ర
ములనువింటఁగూర్చిపేంచిపేంచి
విడచుచుండెఁబ్రాణమడఁగఁబెమానీంద్ర!
ఓపఁజాలదయనుఁజూపవేల?

గీ. బ్రహ్మరుద్రాదులకునైననవశముగాని
యించువిల్కానినేనజయింతుఁజూవె
నీకటాక్షంబుఁగలిగిననిముసమందు
లేనిచోమేనిపైనాసలేదునిజము.

(అని పైఁబడి కౌఁగలించుచున్నది.)

తుల్య-(త్రోసివైచి మహాకోపముతోఁ గంఠారావ మొనర్చుచు) ఓసీ! దురాత్మురాలా? నాతపంబు చెరుపవచ్చినపాతకీ.

మ. ప్రళయానల్పధనంజయేక్షణరుచిప్రస్ఫారనేత్రోద్భవా
ఖిలలోకావళిభీకరానలకనత్కీలాతిదుర్వారమై
జ్వలనాస్త్రాతిగమత్క్రుధానలలసజ్జ్వాలాళికిన్నేఁడిదే
శలభంబై తివిరెందుబోయెదవు! నాశాపంబునిర్వార్యమే.

(అని శాపోదకంబులం జల్లఁబూని)

ఉ. బోఁగఁపుబోఁటి! బ్రాహ్మణతపోధనుముందర; మాయటక్కులన్
బాగుగఁజూపిపోవకనుపైఁబడిదేహముమైలసేయఁగా
సాగితిగాన, నీవిఁకనుజక్కనివారువమై, చరించు, పో
పో, గరువంబువీడఁగను, భూపతినొక్కనిమోచిభూస్థలిన్.

రంభ—హా? దైవమా? హా? దేవేంద్రా? (అనిమూర్ఛిలుచున్నది)

తుల్య-(కోపముతో) ఈకుటిలవర్తనను శపించిననుఁ దప్పులేదు. ఈరంభయెందరికొంపలఁదీసినది. ఎందరి యుసురుపోసుకొన్నది. దీనికిప్పుడు ప్రాయశ్చిత్తమైనది.

రంభ—(లేచివిలపించుచుఁ గాళ్లపైఁబడి)

మ. వనజాతాంబకుఁడేయుసాయకములన్ వారింపఁగాలేకనన్
గినుకంబూనిశపింపఁబాడియొకో? రక్షింపఁగదే? గుబ్బపుం
దనువుంబూనిచరించుటెట్లుధరపై, నాకేశుమోమెట్లుకాం
తును! నారోజులకేమనందు! నకటా! దుఃఖాబ్ధినెట్లీఁదుదున్.

అయ్యయ్యో? బృందారక యక్షకిన్నరాదులచే సన్మానింపఁబడి యప్సరసల లోనెల్లఁ బేరుఁగాంచి, నలకూబరాదిరాజవర్గంబులు, పాదాంభోరుహాలాతుఁ, గుంకుమఁపు బొట్లుఁగాఁగైకొని నిచ్చలుమన్నించి, సేవసేయఁగా తోడినెచ్చెలులెల్లరుఁగాలు క్రింద మోపకుండ నడుగులకు మడుఁగులొత్తి, పూజింపఁగా స్వారాజ్యరమాధిదేవత వలె భోగంబులనుభవించి, వన్నెకెక్కిన యప్సరస శిరోమణి, యగురంభకుఁజతుష్పాజ్జంతువై, భూమిపైసంచరింప వలసిన నిర్భాగ్య యోగము వట్టినదా? తుల్యమునీంద్రా? రక్షించుము? రక్షించుము.

సీ. మునుపంటిగంటునవనటుఁజెందెడుమోవి
యినుపకళ్లెఁపుబాధకెట్లులోర్చు!
కొనగోరుసోఁకినఁగుందికందెడుమేను
కొట్టుకోర్డాదెబ్బలెట్లులోర్చు!
సన్నపైఁటనుమోయఁజాలనియంసంబు
బలువైన, జీనునెప్పగిఁదిఁదాల్చు!
ఘనతగాఁగాఁబేరికపుగింట్లఁజెలువొందు
కాయమానృపునెట్లుమోయనేర్చు?

గీ. యలసగమనంబులౌపాదతలములకట
పవనమునుధిక్కరించుచుఁబరచుటెట్లు?
తాపసోత్తమ! చేసినతప్పుఁగాచి
నన్నురక్షింపుమయ్యప్రసన్నబుద్ధి!

గీ. ఎంతకాలంబుగుజ్జుమై మెసఁగవలయు
శాపమోక్షంబుకనుపించుసమయమెపుడు
యెచటచరియింపవలెనో? నాకేది తెరవొ?
యానతిమ్ము కృపాబుద్ధి వహానినాథ!

తుల్య-(కోపముతో) మత్తకాశినీ! నీయొనర్చిన తప్పిదంబు నీదీనోక్తులచే క్షమించి, రక్షింపఁగరుణబుట్టెఁ గావున వినుము.

రంభ—(దుఃఖించుచు) చిత్తము! మహాత్మా! శెలవిడుదురుగాత?

తుల్య-రామ, నల, భగీరథ, మానవనాథసదృశుండగు, చతుర్థనుండనురాజు, పూర్వ సుకృతంబున త్రిభువనంబులం జూచుట కాతనికిపరంబున్నది. కాన నీవాత నివహించి సర్వలోకంబులుఁ, ద్రిప్పితీసుకొని వచ్చిన వెంటనే నీనిజరూపంబు నీకలవడును. కావ నీవిప్పుడేపోయి, కుండిన నగరోపాంత వనంబునవేఁటకై వచ్చిన నాతని కడకుపొమ్ము. నీకు మేలగుఁగాత!

(అనినిష్క్రమించుచున్నాఁడు.)

రంభ—(దుఃఖించుచు) అహా! నేఁడెంతదుర్దినము? ఎంతపనిజరిఁగినది. అన్నా? నా యంతటిది లేదని విఱ్ఱవీఁగి తుదకిట్టి దుర్దశఁదెచ్చుకొన్నాను. (ఆకాశమువంకఁజూచి) రతిరాజా! నిన్నుమహాశూరునిఁగా, నెంచి, యింద్రుఁడునాకుసాహాయ్యముపంపినందునకుఁ జాలశ్రమపడితివి. నాయంతవాఁడు లేఁడనిగర్వించినందునకు, నీవిప్పుడుండిన నీవేమక్కయో, యేమక్కయో, యైయుండ కుందువా! ఆమునీంద్రుఁడు నన్నులుకఁగొనినప్పుడు దర్పంబుడించి, కాలికొలఁదిఁ బరువిడితివా! నీశౌర్యమేమైపోయినది? నీవేమంటఁగలసితివి? నీవిల్లు విరిఁగిపోయినదా! నీబాణములు నేలపాలయి పోయినవా! చంద్రా! ఇప్పుడేగిన నాకుఁ గూడ నిట్టిదశసంప్రాప్తించునని పారితివా! మలయానిలుఁడా? సోమరివై, సుడివడిచలించి, యెగిరిపోయితివా! వసంతుఁడా! అడవులు చీకాకువడనెచ్చటొడాఁగనేగితివి? చిలుకకోయిలలారా! ఇమ్మసిచెంగటం గూయవెఱచి, యూడనబాడి చివరకు చెట్లపాలైతిరా! తుమ్మెదలారా! ఈముక్కోపి ముందరకు రాఁజాలకరొదలుమాని తుదకు తమ్మిలమరువుఁజొచ్చితిరా! ఇంద్రా! యెంత చెప్పినను వినక, చివరకు నాగొంతుఁగోసితివా? (ఆలోచించుచు) నయము.

ఇంతటితో సరిపుచ్చె. ఏశిలయో, యగునట్లు శపింప నాతని నోటికిఁదలుపా ద్వారబంధమా! శక్తిలేదా? వచ్చినప్పుడే కుడికన్నదరిప ఫలంబుగాన్పించినది. (అనిదేహంబు సూచుకొనుచు) అయ్యో! అప్పుడే గుజ్జుపురూప మేర్పడుచు న్నట్లు దోఁచుచున్నది. సోదరీమణులారా? ఎన్నిజన్మంబులకైననతియేహ్యం బును, నానాపాపమూలంబును, పడుపుకూఁటి జీవనంబునగు నీదిక్కుమాలినవే శ్యాజన్మంబు రాకుండఁ బుణ్యకార్యంబు లాచరించుచుఁ, బెండ్లిండ్లుఁజేసుకొని, సద్గతివడయ, నూహింతురుగాత.

(అనినిష్క్రమించుచున్నది.)



# విచిత్ర భారతము.

ద్వితీయాంకము - ప్రథమరంగము.

(యమునానది.)

(శ్రీకృష్ణుఁడు సూర్యున కర్ఘ్యమిచ్చుచుఁ గండ్లుమూసుకొని జపించుచుండఁగా నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

నార—ఆహా? ఎట్టిపెట్టని రోజులు సంభవించినవి? నిన్నటినుండి యెచ్చటనైనఁ బోరి ద్దుపోవునేమోయని చూచుచుంటినిఁ గాని నామనోరథంబు సఫలము కాకున్నయది.

గీ. త్రిభువనంబులువిసువకఁదిరిగినాఁడ
తిరిగినందునఁబాదంబులరిగెఁగాని
కడుపునిండంగఁగలహంబుకలుగదాయె
నారదుండనఁగానేతిబీరయయ్యె.

(గడ్డంబు దువ్వుకొనుచు) నిన్నటినుండి మనసులోదిగులును, నాకలి విస్తారంబును, నీరసంబుగానుండుటయుఁ దటస్థించినవి. నిన్నమొన్నటి పిన్నపాపనుఁ గానుకదా. పోయేకాలముగాని వచ్చేకాలముకాదు. దిక్కుమాలిన ముదిమియొకటి పెద్ద జాయివలె మీఁదఁబడుచున్నది. లేకున్న నెచ్చటికేగినను భగవంతుని దయవల్లను, నా నేర్పుచేఁతను, యేవేళకేదో కలహరూపముగా బొట్టపోసుకొందును, చింతచచ్చినను జేవచెడలేదన్నట్లు నాకింకనుఁ గలహవాంఛ పోలేదు. కావున నీజీర్ణించిన రుగ్మతకు రేపుప్రొద్దునలేచి యాశ్వినేయులు, మొన్నకల్వములో దయారు నేయుచుండిన కుప్పి యౌషధములు సేవించెదఁగాక! (ఆలోచించి) కాదుకాదు. జ్వరముఁగాదు. రుగ్మతయుఁగాదు. దీనికిఁ గారణము కలహభోజనము కడుపునిండఁగ లేకపోవుటయేకాని వేరొండుకాదు. నిజముగా నేదలంచిన వైరమెంతపని. (ఆలోచించుచు) చిరకాలంబుననుండి ప్రాణస్నేహితులగు శ్రీకృష్ణార్జునులకకారణ వైరంబుఁగల్పించి, యిద్దరిబలాబలంబులును, యిద్దరి పౌరుషంబులునుఁ జూఁడవలెనను నాసక్తి నాకుఁగలదు. అదిసమకూడు నుపాయంబాలోచించి వారిరువురకొక ఘోరయుద్ధంబుఁగల్పనఁ జేసినా కోర్కెఁదీర్చుకొందునుగాక! (యిటునటుఁజూచి) ఓహో! సాక్షాద్విష్ణుండగు కృష్ణుండీయమునఁలో సూర్యభగవానుల కతిశ్రద్ధా భక్తులతో నర్ఘ్యంబిచ్చుచున్నాఁడు. ఈతని దర్శించెదఁగాక, (జపమాలఁద్రిప్పుచు,)

మదనదర్పణము.

మారజనకమౌనివంద్య! చిన్మయాత్మ! కేశవా!
వారిజభవపూజనీయ! విశ్వరూప! మాధవా!
కారణజగదాద్య! సర్వలోకధారణా! గుణా!
ధార! మదసురారివారభేదనాతిశోధనా!

శ్రీకృ—సురమునీంద్రా! నమస్కారము.

నార—దీర్ఘాయురస్తు.

శ్రీకృ—బ్రహ్మమానసపుత్రా! ఇంతకనేపు, తాళుఁడు. హరికి నర్ఘ్యంబొసంగినతర్వాత, కొంతవరకుఁ బ్రొద్దుపుచ్చెదము.

నార—శ్రీకృష్ణా! అట్లనే! అంతవరకిచ్చట నేనుఁగూడ సంధ్యావందనం బాచరించుచుండెదను. (జపమాలఁద్రిప్పుచు సంధ్యవార్చుకొనుచు) నేఁడుకుడికన్నదరుచున్నది. సామనోరథం బిడేరఁగలదు.

శ్రీకృ—(చేతులుజోడించి)

మ. సురలెల్లన్నిను గెంపుఁగాంచ మునఁగా సొంపొందు కెందమ్మినా
వరదిగ్భామినులాఁడుబంతియనఁగాఁ, బ్రాంచజ్జపాశోణమై,
సరసీజాతతపఃఫలంబనఁ బ్రపంచామోదమై, యొప్పిభా
స్వరబింబాకృతివచ్చుహంసకునమస్కారంబులర్పించెదన్.

ఉ. ఏవిభుమూలమై, జగములేఁడును, మోదముఁజెందుచుండునో
యేవిభుఁడీధరాస్థలిని నెల్లరకుంగనిపించుదైవమో
యేవిభుమూలమైధరణికింపుగవానలుఁబంటకల్గునో
యావిభులోకబాంధవునహర్పతి నెంతయుభక్తిఁగొల్చెదన్.

సీ. నీరూపమేకదానీకమందునబ్రహ్మ
భూపేంద్రులకునెల్లఁబోవుదారి
నీరూపమేకదానీరజాలయునాథు
కుడికన్నుగానిల్చి బెడఁగుఁజూపు
నీరూపమేకదానిల్చిమునుమూర్తులుఁ
గలరూపమైవన్నెఁగాంచుచుండు
నీరూపమేకదానిలువంగనీడయ్యె
సానదేరినరస్మిచయములకును



గీ. సత్యమై, నిత్యమై, పొల్చు జగములెప్పుడు
నీదురూపంబుచేఁ గాదె నిఖిలవంద్య
వేదశాస్త్రములు భూమిపై వెలయుచుంట
నీదురూపంబునం గాదె నీరజాప్త.

దండకము.

శ్రీమీరదిక్తంప, సంపూర్ణ ఘోరాంధకారోగ్ర నక్తంచరుల్ దివ్యతేజంబు నల్ద్రుంచి, సర్వప్రపంచంబునుం దెల్పి, లోకార్తిం బోకార్చు, శ్రీ సూర్యనారాయణా? దేవచూడామణీ? భక్తచింతామణీ? దేవ? ఛాయాసతీ మానచోరా? త్రిమూర్త్యవతారా? జగజ్జీవనాధారి? ప్రద్యోతనా? యుష్ణరశ్మీ? సహస్రాంశు మిత్రార్యమా? మానిపంద్యా? నభోమార్గవర్తీ? చిరద్దివ్యకీర్తీ? జగచ్చక్షు? సాక్షాజ్జగద్రక్షణా? పద్మినీవల్లభా? కైరవారీ? సురస్తుత్యా? సుశ్లోకయంచుల్? నదీవాపభూరిహ్రద శ్రేణులన్ నిల్చి, సుస్నాతులై, భూతిపుండ్రప్రభాస్మేర నీరాక విపంచెల్కటింజుట్టి చేదోయి సంధించి, ఫాలంబులన్మోడ్చి, జోహారులం జేయు, భూమీసురస్తోమ వేదోక్తులన్మోద ముప్పొంగఁగా నేకచక్రంబుతో నొప్పు తేరెక్కి, భూలోక మెల్ల న్ముదంబంది కీర్తింపఁగాఁ, బ్రాగ్గిరిన్ గెంపుఁ గెంజాయతో, మమ్ముఁ బాలింపఁ గావచ్చు, నోకర్మసాక్షీ! భవన్మూర్తిభావించి నీనామసంకీర్తనల్ సేయఁగా, సర్వవ్యాధుల్ పటాపంచలై పోవు, సౌఖ్యంబు చేకూరు, నిష్టార్థముల్గల్గు దేవేశ? నన్నుం గటాక్షింపవే! సూర్యనారాయణా! వేదపారాయణా! దివ్యమూర్తీ! చిదానందవర్తీ! నమస్తే, నమస్తే, నమః.

(అని యర్ఘ్యమిచ్చుచుండఁగా, గగన మార్గంబునఁ బోవుచుండిన, చతుర్ధన మహారాజుయొక్క గుజ్జుపునోటినురుఁవు శ్రీకృష్ణుని చేతిలోఁబడును.)

కృష్ణ—(చూచి కోపముతో) ఏమిది? ఈయెంగిలి నాపూత జలాంజలిలోనికెట్లువచ్చినది? (పైకిచూచి) నారదా? నభోమార్గంబున నశ్వారూఢుఁడై చనుచున్న యానృపపశువీ యపకారం బొనర్చెనని తోచుచున్నది.

నాగ—(సంతోషముతోఁ దనలో) నాకు మంచిసమయంబు చేకూరినది. సంకల్పమనోరథుండనైతిని. దీనిలో నాసర్వశక్తి వినియోగపఱచి, చినుకు చినుకు, గాలివానఁ జేసెదఁగాక! (ప్రకాశముగా) యదుకులావతంసా! (పైకిఁజూచుచు) ఎవ్వరో దుర్మార్గుఁడు గగనంబున నశ్వారూఢుఁడై చనుచు నిన్నుసరకుఁ

గొనక గర్వంబునఁ గన్నుఁగానక నీకిట్టియుపకృతిం బొనరించెనుగాని యొఱుంగ కఁ జేసినపనికాదు.

కృష్ణు—(కోపముతో) ఓరీ! నృపాధమా! మహాపరాక్రమోదారదుర్వారవైరి బాహు బలారణ్యపావకుండనగు నాకపకారం బొనరించి, ముల్లోకంబుల నెందైనఁ బ్రతుకంగలవే?

శా. ఓరీ! దుర్మద! యోరిద్రోహి! ఖల! గర్వోపేత! దుష్టాత్మ! దు
ర్వారప్రాభవమత్తచిత్త! శఠ! పాపాత్మా! పశుప్రాయుఁడా!
క్రూరా! యెచ్చటికింక నేగెదవు! నాకోపంబుఁ జల్లార్పఁ గ
బ్బారన్ నీకిఁకఁ జావుతప్పదుసుమా! బ్రహ్మాండమందెందులన్.

(జలంబుఁ జేనందె.)

మ. వినుఁడీనాదుప్రతిజ్ఞ దేవతలు పృథ్వీభూతసంతానముల్
వినువీధిం జనుభూపుమస్తకముఁ గేళీకందుకంబట్లు, మ
ద్ఘనచక్రాహతి నొక్కమాసమున వీకన్ జెండు బెండాఁడి నే
ననిలోఁద్రుంచెద, బ్రహ్మశక్రశివులడ్డైనిల్చి కాపాడినన్.

(జలంబులు విడుచుచున్నాఁడు.)

నార—(చేతులుజోడించి)

సీ. శ్రీరమాశ్రితవక్షసింధురరిపుశిక్ష
భక్తరక్షాయతుభ్యన్నమోస్తు!
భాసురయదువీర! ప్రణుతగుణాధార!
దీపితమందార తేనమోస్తు!
బృందావనవిహార! నందగోపకుమార!
దీనపోషాధార తేనమోస్తు!
సన్నుతామరనాథ! సరసగానామోద
దీప్తబర్హవిహార తేనమోస్తు!

గీ. శౌనకాదిమునిస్తోత్ర తేనమోస్తు!
వల్లవీప్రాణనాథతుభ్యన్నమోస్తు!
దేవకీగర్భరత్నమా! తేనమోస్తు!
వందితాఖిలలోకతుభ్యన్నమోస్తు!

మ. వనజాతోద్భవకృత్తివాససురజంభారాతికోటీరపా
వనభాస్వన్నవశోణరత్నమణిశుంభద్దీధితీజాలశో
భనపాదాంబుజుఁడై ననిన్గనుటయేభాగ్యంబునాజన్మపా
వనమా యెన్నువనైకమోహనకలాపా! సత్యభామాధవా!

కృష్ణ—(నవ్వుచు) బ్రహ్మమానసపుత్రా! నీవచో విలాసంబు కడు మెచ్చుగులెక్కెడి. నాయందుఁగల సంపూర్ణ ప్రేమాతిశయంబుచే నిట్లంటివి కాని వేరు కాదు. భవదీయవర్ణనంబున ధన్యుండనైతిని. (ఆకాశముఁజూచి) కలహప్రియా! చూడుము. చండభానుండు తన సహస్రకరంబుల నల్దిశలంబరఁగింపుచు, సంపూర్ణతేజంబులో బ్రజ్వరిల్లు చున్నాఁడు. చాలపొద్దెక్కినది. బలరామాదులు నాకొఱకై యెదురు సూచుచుందురు. భోజనసమయం బాసన్నమైనది. మరేమియుఁ గార్యవింతలు లేవుకద?

నార—శ్రీకృష్ణా? నిన్ను దర్శించుటకన్నఁ గార్యత లేమున్నవి?

కృష్ణ—ఉండనచో త్రిలోకసంచారులగు మీకుఁ దెలియకుండునా?

నార—నిజము.

కృష్ణ—మునీంద్రా? ద్వారక కేగుదమురండు,

నార—దేవకీనందనా? నాకుఁజాల తొందరపనియున్నది. ఈసారివచ్చి నీయింట నీయిచ్ఛవచ్చినంత కాలంబుండెద. ప్రస్తుతము నన్ను క్షమింపుము.

కృష్ణ—మీచిత్తము. నాకు శెలవొసంగినఁ బోయివచ్చెద.

నార—మంచిది. పోయిరమ్ము.

కృష్ణ—(నిష్క్రమించుచున్నాఁడు.)

నార—(నవ్వుచు వీణవాయించుకొనుచు) భువనైక వీరుండఁగు శ్రీకృష్ణుని, ప్రతిజ్ఞ లంఘ్యము. పాపము. సర్వలోక పూజితుండును, సత్యపారీణుండును, ధర్మవర్తనుండగు చతుర్థునకిట్టి యాపదరాఁదగినది కాదు. కాని నామనోరథం బీడేరినందులకుఁ జాల సంతోషముగా నున్నది. నాకుఁ జేతినిండ పనికల్గినది. వాకిఁక నిలుచుట క్షణకాలంబైన తీరదు. నేనిపుడు వుండిన పురాధీశ్వరుండఁగు చతుర్థునికడకేగి యాతనికీయుదంతం బాద్యంతముఁగా నెఱింగించి తరువాత సంగతి నాలోచించెదఁగాక?

(నిష్క్రమించుచున్నాడు.)



# విచిత్రభారతము.



## ద్వితీయాంకము - ద్వితీయరంగము.

(కుండినపురోపాంతవనంబున నొక్కమేడ)

చతుర్థనమహారాజు ప్రవేశించుచున్నాడు.)

చతు--(సాశ్చర్యముతో) ఆహా! ఏమీ! యాగమనంబు? ఏమియాయందంబు? ఏమియాయాశ్వము? అశ్వమేధమైనచోఁ బంచదివసంబులలో, త్రిలోకంబులఁ, జతుర్దశభువనంబులఁ, ద్రిప్పితీసికొనివచ్చి మరల నన్నిచ్చటడించునా! అటువంటి చుఱుకుఁదనంబును, నటువంటి జ్ఞానవిశేషంబును, నటువంటి వాయువేగంబునుఁ, బూడసీలోకంబున నే గుఱ్ఱమునకైనఁ గలుఁగునా? కలుఁగదు. కలుఁగదు. అదినిజంబుగా నన్నుద్ధరింప వచ్చిన దేవతాసాంబ్రాణియై యుండనోపు. లేకున్న మానవమాత్రుండనగు నేనీబొందితో సర్వలోకంబులఁ జూడఁగల్గుదునా! (అనితన కెదురుఁగా దూరంబుగానున్న యశ్వంబుం గాంచి) ఆహా?

ఉ. దైవకృతంబులెవ్వరికిఁదప్పవు, లోకములెల్లఁజూపినన్
బావనుగానొసర్చికొనివచ్చినవారువమద్భుతంబుగా

ఏమిా? ఈయాశ్చర్యము? ఏమీయీవింత?

" "తీవమెఱుంగుఁజేరఁదగుదేహముతోఁదులఁదూఁగిమోహినీ
దేవతభంగినిట్లుచనుదెంచెడి? కారణమేమి! బాపురే!

రంభ--(నృత్యముసేయుచు రంభప్రవేశించుచున్నది.)

చతు--(చూచియాశ్చర్యముతో) ఆహా!

ఉ. చక్కనిమోముకంచుకముచాలకచించినంగబైటపై
నిక్కెడుగుబ్బలున్ముఖమునిండినకండ్లు, గులాబివన్నెలౌ
చెక్కిళులున్ సుధంజిలుకుచెల్వపుమోవికినేమిగాని, చే
ర్చుకకునియ్యవచ్చుసుమా? మ్రొక్కుచుఁగోటివరాలుపానిసి.

సీ. నీమోముతోఁ జేరినిల్వఁగీర్తి యటంచు
నిందుఁడు నిన్నాశ్రయించెనేమొ?
నీపైఁటలో మాకు నిల్వనీడగునంచు
జక్రముల్నిలువంగఁ జూచెనేమొ?
నీనాసయై నిల్వనీటంచు నినుఁ జేరి
ప్రోవ్వమంచనెనేమొ నూవుఁబూవు?
నీదుమైలతికతో స్నేహంబు సేయంగఁ
గోరి క్కారుమెఱుఁగెంత మ్రొక్కుకొనెనో?

గీ. గరుడగంధర్వకిన్నరకాంత వేమొ?
భూమిఁ గ్రుమ్మరు మోహినీభామ వేమొ?
లేకనీయంగములసౌరు లేవయన్ను
నేవయారికిఁ గల్గెడునో వయారి?

(అని కౌఁగలింపఁబోవుచున్నాఁడు.)

రంభ--(తప్పించుకొని నవ్వుచు) రాజా! ఏలయిట్లు పరిభ్రమించుటలు? ఎందులకీ యవస్థ! అందరానిఫలంబుల కఱ్ఱులుసాచినలాభమేమి! అయినను రాజులు పరాఙ్ముఖులు. వారికివేయికన్నులు.

ఉ. చేయఁగరానిశబ్దములఁ జెప్పఁగశక్యముఁగాని ప్రేమలన్
మాయలఁ దేనెతేటలగు మాటల చేవలపించి, యాపయిన్
రాయిడిఁ జేసి మీయవసరంబరుఁగన్ దడిగుడ్డ కుత్తుకం
గోయు మరీస్నృపోత్తముల కూటము లెవ్వరెఱుంగ రిద్ధరన్.

చతు--(చేరఁబోయి) శృంగారవతీ! ఎవ్వరో యట్లొనర్చిరని, యందరినిట్లు తూలనాడుట న్యాయమా! చూడుము.

మ. కరులా! సౌధములా! మహాంబరములా! కంఠీరథశ్రేణులా
హరులా! కాంచనమా! వినూత్నమణులా! హారంబులా! రాజ్యమా!
సరసీజాక్షి రా! కోరుమెద్దియయినన్ సంభ్రమంబుగానిత్తు, స
త్వరతన్ బ్రాణములైననిచ్చెద నుసౌందర్యప్రభావోన్నతీ.

రంభ--(తనలో) ఈతనినింక పలుకరించిన లాభములేదు. ఈమహాపుణ్యమూర్తి సృ ర్శవల్లనేగదా నాశాపవిముక్తి యయినది. ఈతఁడు నావృత్తాంతం బెఱింగిన నింతవరకు పలుకఁడు. కావున నీతనికిఁ గొంచెమువిరక్తి మార్గంబుపదేశించి, కృతజ్ఞత కాన్పింప మేలొనర్చి మరియుఁ బోయెదగాక! (ప్రకాశముగా) పుణ్యస్వరూపా! చతుర్ధనమహారాజశేఖరా!

ఉ. గౌరవహీనముమ్మలికకారణమార్యవినిందితంబువి
స్తారకృధాకరంబు, సుభసౌఖ్యవినాశనహేతువాధన
స్త్రీరతికాంక్షకూడదనిచెప్పిరిపెద్దలుశాస్త్రమందు, సం
సారివి. మంచిచెడ్డలవిచక్షణనేర్తువు, నీవెరుంగవే.

చ. కులుకుచుభూషలందొడఁగికోకలగట్టియునెట్టుతోలుతో
తళుకుమనంగపూరుషులుతల్లడమందిజమీలనూళ్లనుర్
బొలములధారబోయుదురుపొల్తుకలిండ్లనులేరె! వారలుర్
వెలదులుగారె! మోహమొకవట్టి! తుదిర్ తలపంగనేహ్యామా.

చతు---(తనలో) ఈమెపల్కులు వినసెవ్వరో భోగవిరక్తిఁ జెందిన వేశ్యావధూటిగా గాన్పట్టుచున్నది. నెమ్మదిగా నడిగెద గాక! (ప్రకాశముగా) తరుణీ! నీనీతివాక్కులకుఁ జాలసంతసించితిని. నీవెవ్వతెవు. నీయుదంతం బాద్యంతంబుఁగాఁ దెల్పుము. వినవేడుకగుచున్నది.

రంభ--(నవ్వుచు) భూపతిలకా! నేను దేవవేశ్యను. పేరు రంభయందురు. కాపురంబు స్వర్గపట్టణము.

చతు---(హాశ్చర్యముతో) సుందరీ! గుఱ్ఱమెట్లయితివి?

రంభ-చ. నరవర! తుల్యుఁడన్మునివనంబునశ్రీహరికై తపంబుభీ
కరముగఁజేయ, వజ్రినను గ్రక్కునఁబంపినఁనేగివానినే
నరిమురిఁజేసిపైఁబడిననాతఁడలింగిమహోగ్రవృత్తితో
తురఁగమవై చరింపుమనితొక్కినపామయినర్ శపింపఁగార్

ఎట్టకేలకు దుఃఖించి శాపమోక్షణంబడుఁగ, నినువహించి సర్వలోకంబులు ద్రిప్పితీసికొనివచ్చి విడచిన నెప్పటిరూపంబు నీకలవడునని కనకరిపొమ్మన నారీతిస లుపనిట్లయితిని.

చతు—సురనారీమణీ! తప్పులు క్షమించెదవుగాక!

రంభ—రాజా! ఎంతమాట. పోనిమ్ము. ఈగతజలసేతు బంధనంబేటికి? కాని, నీగుణాతిశయంబునకును, నీపుణ్యసంపన్నత్వంబునకును జాలసంతసించితిని. కావున నెవ్వరికిఁ దెలుపరానిదియు, సర్వజన వశీకరంబును, సర్వదేవతాకర్షణంబును, నిఖిలజగన్మోహనంబును, నిత్యలక్ష్మీకరంబును, మోక్షప్రదంబునగు నారాయణ మంత్రరాజంబుపదేశించి మరియుఁ బోయెదం గాక!

చతు—దేవతాసువాసినీ! నీకు నాయెడంగలుఁగు కరుణాతిశయంబునకు నపార సంతోష భరితాంతఃకరణుండ నైతి. శిరిరామోకాలొడ్డు వారుఁగలరా? అట్లనే జేయుము. సర్వసిద్ధుఁడనై యున్నవాఁడ.

రంభ—రాజచంద్రా! సునిశ్చల భక్తితో వినుము. (చెవిలోఁ జెప్పి) పుణ్యస్వరూపా నీకు మంత్రసిద్ధి యగుంగాత! (అని దివ్య విమానారూఢయై నిష్క్రమించుచున్నది.)

(పట్టమహిషియగు కమలాదేవి ప్రవేశించుచున్నది.)

కమ—ప్రాణనాథా! నమస్కారము.

చతు—పట్టమహిషీ! దీర్ఘాయురారోగ్యమస్తు. ఇట్లుకూర్చొనుము.

కమ—(కూర్చొనుచున్నది.)

చతు—సతీమణీ! మనముద్దుల కుమార్తెయగు నవమోహినియు, కుమారరత్నంబగు గుణసాగరుండును, సుఖులై యుండిరా! నీవు క్షేమంబుగ నుంటివిగదా!

కమ—నాథా! అందఱు క్షేమంబుగనుండిరి. మీరయిదు రోజులక్రిందట వేటకేఁగి నారనియు, నచ్చటనొక మాయాశ్వమెక్కినది గగనంబునకుఁ బరచెనని యు విని యిన్నిదినంబుల నుండియు, విచారించుచు మీరిప్పుడి వచ్చితిరని తెలసి చూడవచ్చితి.

చతు—ఔను! నీవువినినదంతయు సత్యము.

కమల—మీరారోజున నశ్వారూఢులై పోయి యింతవనుకఁ దడయుటకుఁ గారణ మేమి?

చతు—చెలియా! చెప్పెదవినుము. నేనారోజున వేటకేఁగి తుల్యాశాపంబున, రంభ, గుఱ్ఱంబై, వచ్చినఁగని, దానినారోహణముసేయ నదిగగనంబునకెగసి వాయు వేగంబు నతిక్రమించుచుఁ బాఱి సగరజాంతనవ మోక్షజనన మూలంబైన మందాకినీనదిందాటి, లక్ష్మీశ్వరుండు, శయనించు, దుగ్ధవారిధింగడచి, దేవతావి

టి విలాసినీ సంచారంబగు సురాలయంబువిడచి, బృహద్భాను పురంబగు నగ్ని వృత్తి నగరంబుం గాంచి, సంయమినీ నగరంబు తరించి, నైరుతీ పరిపాలితంబగుపుణ్యావతీ తీరంబుంజూసి, త్రిపథసూర్యనందన, కృష్ణవేణ్యాది నదీసంగమంబున, వరుణున కిరవగు, నమరావతిం జూచి, పవనిధీనాయక నివాసంబగు నలకాపురంబు దర్శించి, చండభానుమండలియైన, యీశానుంగని శిరశ్శశాంక, రేఖాలంకృతుండగు శితికంఠుని కైలాసంబు వీక్షించి దివ్యజ్యోతి రాకారంబగు, భానునియనుగమించి, రోహిణీప్రియుండగు చంద్రుని సేవించి, గరుడయక్షసిద్ధసాధ్య కింపురుష బ్రహ్మర్షి పరివేష్టితుండగు బ్రహ్మకు నమస్కరించి, మన్ననలంబడసి, హేమభూమీ ధరంబు పలక్షించి, శుద్ధోదక సముద్రమధ్యంబున నున్న శ్వేతద్వీపం బవలోకించి, యచ్చట విష్ణుమూర్తికిం బ్రణామిల్లి, సముద్రతరణం బొనర్చి, చతుర్థ వ్యూహాధిపతియగు శేషశాయికిం గేలుమోడ్చి, దధిఘృత సురేక్షురసలవణ నీరధులలంఘించి, భరతఖండోర్ధ్వభాగంబుననున్న కుండిన నగరంబుపై నుండివచ్చి నేటికి నారాజ్యంబు సేరితిని. అంతట వర్ణింప వేనోళ్లచిలువకైనం బంచముఖ బ్రహ్మకైన నలవిగాని ప్రభావంబుల నాయుత్తమాశ్వంబు నేను, డిగుటతోడనే, రంభయై యమోఘంబగు మంత్రంబుపదేశించి, దివ్యవిమానారూఢయై దేవలోకంబున కేవుపచ్చునప్పుడే చనియె. ఇదియే నావృత్తాంతము.

కమల—మనోహరా! మీరుమరల నాకంటబడినందులకుం జాలసంతసించుచున్నాను.

(హరిస్మరణసేయుచు నారదుండు ప్రవేశించుచున్నాడు.)

నార---కవిరాజ విరాజితము.

దశరథనందన! తాటకమర్దన! తాపసవందితదైత్యహారా!
పశుపతిచాపవిభంజన! గౌతమవారిజలోచన పాపహరా!
శశిధర వాసవసంస్తుతమూర్తి! విశాలయశోభన! శౌర్యనిధీ!
దశముఖ ఖండన! దర్పకరూపక! ధైర్యసురాచల! దాశరథీ!

చతు—(లేచి) సురమునీంద్రా! నమస్కారము.

నార—నారాయణ. నారాయణ.

కమ—బ్రహ్మమానసపుత్రా! వందనము.

నార.—నారాయణ. నారాయణ. నారాయణ.

చతు—బుషీంద్రా! ఇట్లు కూర్చొనుఁడు. (పీఠమునిచ్చుచున్నాడు.)

నార—(కూర్చొని) రాజా!

గీ. ప్రజలకెల్లనుసుఖమె! నీపాలనమున
నడుపుచుంటివెధర్మంబుబుడమిమీఁద
శుభమె? నీదేవికినినీకు. శోభనంబె?
బాంధవులకెల్లఁజెప్పుభూపాలతిలక!

చతు—మౌనిచంద్రమా! భవదీయాశీర్వచనంబున నందఱు సుఖంబుగానున్నారము. కొంతలేక నాపాలనంబున ధర్మదేవత నాల్గుపాదముల నడచుచున్నది.

నార—నారాయణ. నారాయణ. (తనలో) నన్ను ముక్కలు చేసినను, రహస్యము నాకడుపులో దాగదు. అట్లు దాచిన నాకడుపు పూరీవలెనుబ్బును, వృద్ధాప్యము వచ్చినప్పటికి, యిప్పటికివరకు నెచ్చటికేగినను, యెద్దియో పిడుగువంటి వర్తమానంబే చెప్పుచుంటినిఁగాని యెన్నఁడూ, యెచ్చటనూ శుభవార్త తెల్పిన పాపమునఁ బోలేదు. ఇత్పుడతి సంతోషముతో నిష్టాగోష్ఠినిఁ బొద్దుపుచ్చుచున్న నీతనికి గృష్ణుప్రతిజ్ఞాప్రకారం బెఱింగించుటకు నోరురాకున్నది. చెప్పకపోయిన నాకుఁగష్టము. చెప్పిన నీతనికిఁ గష్టము. వెలకాఁకయగొంతుకఁ బడినట్లు నాకేమియుఁ దోచుటలేదు. ముందునాకుఁ జాలపనియున్నది. (ఆలోచింపుచు) కానిమ్ము వచ్చినపని త్వరలోముగించుకొని పోయెదఁగాక!

చతు—మునికులతల్లజా! ఎవమకన్నదురఁ జొచ్చెను. మీరాకకుఁ గారణంబేమి?

నార—(తనలో) బాగుగానున్నది. ఈతనికి దివ్యశకునంబులగుచున్నవి. (నవ్వుచు) ఎవ్వరూ లేరుగద! (ఇటునటుఁజూచుచు) రాజా! నీతో నొక పరమరహస్యంబుఁ జెప్పవచ్చితి.

చతు—చాలసంతోష మయ్యెడి. దేవీ! మరలవత్తువుగాని నీసౌధంబున కేగుము.

కమల—చిత్తము. (నిష్క్రమించుచున్నది.)

చతు—దేవబుషీంద్రా! ఆపరమరహస్యమేదియో శెలవిందు?

నార—(తనలో) ఆకటా! ఈతనికీ పిడుగువంటి వార్తనెట్లు దెల్పుదును! (ప్రకాశముగా) నారాయణ. నారాయణ. రాజేంద్రా!

సీ. నిన్నుఁజూడంగదుఃఖంబునెగడుచుండె
ధర్మమూర్తికినీకురాఁదగినయట్టి
యాపదిదియనిచెప్పనీయాత్మయెంత
తల్లడిల్లునో? యేమందుదైవఘటన.

చల్లకువచ్చి ముంతదాచుటేల! చెప్పెదవినుము. నీవు మాయహయంబునెక్కి చతుర్దశ భువనంబులుఁ దిఱిఁగి గగనంబునఁ గుండిన నగరోపాంత యమునానది మీఁదనుండి వచ్చుతఱి నీగుఱ్ఱము నేమ్మొగంబునం, బుట్టినయుఱుఁగుయనిల వశంబున, యమునలోఁ బ్రభాత సూర్యునకు జలతర్పణంబొసఁగు శ్రీకృష్ణుని, జలాంజలిలోఁ బడినఁ జూచి, సాక్షాద్విష్ణుండగు కృష్ణుండుమైమరచి, మైలఁబడితినని.

మ. కనులన్ నిప్పులురాలనల్దిశలుచీకాకై పడన్ దేవతల్
వణకన్ ధారుణిదద్దరిల్లఁగనుకోపాటోపముప్పొంగ, నే
మనుజాశ్వంబిటుజేసె, వానిననిలోమాసంబులో ద్రుంతునే
ననుచున్ ఘోరప్రతిజ్ఞఁబట్టెజనపాలా? చక్రధారన్ వడిన్.

కావున నీయాత్మ సంరక్షణకైతగు నుపాయం బాలోచించుకొనుము. నేను పోయివచ్చెద. (నిష్క్రమించుచున్నాడు.)

చతు---హా! దైవమా! (మూర్ఛిలిలేచి) హా! విధాతా! క్రూరహృదయా! నాకెట్టి చావు విధించితివి? ఇట్లుజరుఁగునని కలలోనైన ననుకొనలేదు.

ఉ. ఏటికివేటకేగితినో? యేటికిగుఱ్ఱముకానుపించె, నే
నేటికినెక్కినాడ! కట? యేటికినగ్గొనిపోయె? కృష్ణుడా
యేటికినేటికేగె! హయమేటికినాపయిఁబారె? నోటిను
ర్వేటికికృష్ణుచేతఁవడె! నేటికినిట్టిదిపుట్టె! దైవమా!

అక్కటా?

ఉ. న్యాయముసెంచకుండయదునాయకుఁడాగ్రహవృత్తికుత్తుకం
గోయఁగఁబూనె! నేరిఁగనుఁగొందునికెవ్వరుకాతురీమహో
పాయము. బ్రహ్మనానుదుటవ్రాసెనకాలపుమృత్యువంచునా
హా! యిఁకనేమనందుహరికడ్డె? త్రిలోకములందుఁజూచినన్.

హా! కృష్ణా! జగద్రక్షకా!

చ. తురగము వచ్చినన్నటులఁ గోకొనిపోవు టెఱుంగ, నీవు భా
స్కరునకుఁ దర్పణంబిడుటఁ గంటివె? ఫేనము జారివచ్చి, నీ
కరవనజంబులోఁ బడుట గాంచన కారణకోపమూని, నా
ద్వరఁ గతిఁ జంపఁగాఁ బ్రతినఁ బట్టిన లోకము మెచ్చునా? హరీ?

సీ. ధర్మంబు నాల్గుపాదముల నునడపుచు
నింపుగా రాజ్యంబు నేలుచుంటి
కలధారుణీశులా దలలువంపుచు మ్రొక్క
నింపుగా రాజ్యంబు నేలుచుంటి
నగ్రవర్ణంబుల నతిభక్తిఁ జూచుచు
నింపుగా రాజ్యంబు నేలుచుంటి
ధరణీజనంబు మోదముతోడఁ గొలువంగ
నింపుగా రాజ్యంబు నేలుచుంటి.

గీ. మంచిరాజితఁడనఁగ నుతించు కీర్తి
నెంతయును సర్వరాజ్యంబు నేలుచుంటి
యిట్టినను జంప నెంచితి వేమనందు
పాలితాఖిలలోకభూపాలచంద్ర!

ఆహా? ఎంతహానికినిఁ గాలమొక్కరీతిగాఁ జనదుగదా? పూర్వజన్మంబున నే మహాత్ముల నిడుమలఁ గుందించితినో నాకిప్పుడనుభవింప వలసివచ్చినది. హా? కృష్ణా? బ్రహ్మమహేశ బృందారకాధిప గరుడ గంధర్వాదులే నీకుఁ గేలుఁదోయి జోడింప రాజమాత్రుండనగు నే నెంత? అతిదూరంబున నుండివచ్చు చుండుటం జేసి యలసటచే గుఱ్ఱపుముఖంబునఁ బుట్టిన ఫేనంబు కాలవశంబునను, గాలివశంబునను, నాకర్మవశంబునను, జారి నీచేదోయింబడిన నిట్టి ఘోరప్రతిజ్ఞఁ బట్టుట ధర్మమేనా? చెట్టునం గాచిన పిందియూ, త్రుంచుటకు? ఎంతకఠిన మానసుండవైతివి? శిష్టజనరక్షణంబును, దుష్టజన శిక్షణంబును, సలుపుదువను బిరుదునామంబులు ధరించిన నీవే యిట్టియధర్మంబుల కొడిగట్టిననిఁక భూలోకంబున ధర్మంబడుగంటకుండునే? నిన్నుఁగానక నీచేదోయిలో నుమియు నన్ను నీవు శిక్షించుట ధర్మపథంబుగాని జ్ఞానమెుఱుంగని చతుష్పాజ్జంతువు నోటినుండి జారిన, నురువునకా నన్నుం జంపి నాయాలుఁ బిడ్డలకు వి

యోగదుఃఖంబు గల్పింప నెంచితివి? ఎట్టి ఘోరప్రతిజ్ఞఁ బట్టితివి? హా! దీనదయాపరా! హా? యదువీరా! ఇఁక నాకు దిక్కెవ్వరు? ఎవ్వఁ డేడుకొందు? ఏమి సేతు? హా! భగవంతుఁడా నీకృపఁ దప్పినదా! నీకంటికి నేను బరువైతినా? (అని మూర్ఛిల్లుచున్నాడు)

(కమల ప్రవేశించుచున్నది.)

కమల—(దుఃఖించుచు దగ్గఱకేగి) ప్రాణకాంతా! ప్రాణకాంతా! ఇంత దనుక నారదునితో సరస సల్లాపంబు లాడుచుంటిరే! ఇంతలో నిట్లు దీనవదనులై మూర్ఛిలియుండుట కంత కారణంబేమున్నది? కలహాశనుండేమైన కీడువార్త దెలిపెనా! లేకున్న భువనదీప్తంబగు భవన్ముఖాబ్జంబు వాడియుండుటకు హేతువేమి?

చతు—(లేచి దుఃఖముతో గౌఁగలించుకొని) ప్రియామణీ! ప్రియామణీ!

గీ. భువిని క్షీరోదకన్యాయమును మెలఁగు
మనకు నెడబాటు సంభవించెను లతాంగి.

కమల—(దుఃఖముతోఁ గౌఁగలించుకొని)

,, ,, యింతలో నేమి వినినారలిట్లు వలుకఁ
గారణంబేమి! చెప్పుమా ధారుణీశ!

సీ. కలిమి లేములకెప్డు దలఁకక నిచ్చలు
భక్తిఁ జూపెడునది భార్యకాదె!
కష్టసుఖములందుఁ గనిపెట్టి ప్రేమతో
బాలించునదిచూడ భార్యకాదె!
మనమునను న్నట్టి వనటఁ బాపుచు సౌఖ్య
పదవి జేర్పఁగఁ జాలు భార్యకాదె!
యవనిలో భర్తకు నపకీర్తి సత్కీర్తిఁ
బడయ గారణ మెల్ల భార్యకాదె!

గీ. యిహపరంబులయం దెప్పుడెంచిచూడ
పడఁతియాధారమౌ సుమా భర్తకెప్పు
డట్టినాతోడ లోపలి గుట్టువిడచి
హృదయమున భీతిఁ దెల్పుము సదయహృదయ

చతు—(దుఃఖముతో) హా! ముద్దులగుమ్మా! హా! నాసహకారిణీ! హా! నాజీవితేశ్వరీ!

మ. కలలోనైననునన్నుఁబాయకను, సౌఖ్యంబిచ్చుచున్ గ్రీడలన్
వలపుంజూపుచు, సంతసంబిడుచు, నవ్యప్రేమబుట్టించుచున్
దళమాకోర్కులకెల్లమూలమయిహృద్యంబైననీకూర్మికౌ
గిలిదూరంబయిపోయెనాకుకనకాంగీ! కృష్ణుమూలంబునన్.

హృదయేశ్వరీ! ఏమనిచెప్పుటకు నోరాడకున్నది. దంభాశ్వంబెక్కి త్రిలోక సంచారంబొనరించి, గగనమార్గంబున యమునపైనుండి వచ్చుచుండ, నాగుఱ్ఱపునోటి నురువు నాదురదృష్టవశమున యమునలో సూర్యునకుఁ దర్పణంబిడు, శ్రీకృష్ణుని జలాంజలిలోబడ, నాతండు, నన్నొకనెలలోఁ జక్రంబునఁ ద్రుంపఘోరప్రతిజ్ఞ బట్టెనని నారదుండు చెప్పిపోయెను. నేనుద్రుంగుటకు శంకింపనుగాని నీకుమారమై పోవుచుంటినను కడుపుకోతచే దుఃఖింపుచుంటిని.

కమల—(దుఃఖింపుచు) హా! నాథా! నారదుండు వచ్చుటతోడనే నాగుండెలో పెద్దఘాయి పడినది. నారదా! యీయశుభవార్త చెవిని బడవేయుటకా వచ్చితివి? అందుకొరకేనా! నన్నుఁ బంపివేయంబంచితివి? మాయాశ్వమా! తలపని తలంపుగా నాప్రియునకు నాజీవితేశ్వరునకు నకాలమృత్యువైతివా! హా! కృష్ణా? వాయువశంబున గుఱ్ఱపునోటినురువు జారిపడిన నింత ప్రతిజ్ఞ బట్టవలెనా! నీశౌర్యంబునకు, నీచక్రంబునకు నీతఁడొక్కఁడే యీభూలోకంబునఁ గానుపించెనా? హా! నాథా? హా! నాథా?

సీ. చలిచీమనైననుఁజాద్రొక్కకుండగవు
పాదాబ్జమునసెప్డుప్రాణనాథ!
కలలోననైననవ్వులకైననేవేళ
బలికిబొంకెరుఁగవుప్రాణనాథ!
దగ్గరజనమెంతతప్పొనర్చినఁమీఱి
పన్నెత్తిపలుకవుప్రాణనాథ!
దుష్టాత్ములెవరైనదూషింపగాఁగ్రూర
భావంబుఁజూపవుప్రాణనాథ!

గీ. ధర్మకార్యంబటన్న ముందరనడుంగు
బరుపుదువు వెన్కదీయకఁ బ్రాణనాథ!
యట్టినీకిట్టియాపదలల మెనకట!
యేమనందునికేగతి! యేదిదారి!

ఉ. హా! సుకుమార! హా! నరవరాగ్రణి! హాసకలార్థికల్పకా!
వాసవభోగ! హా! దివిజవందిత! హా! కరుణాపయోనిధీ!
హా! సుజనైకలోల! సుగుణాకర! కృష్ణుఁడునీదుకుత్తుకం
గోసియు, నాకునీపసుపుకుంకుమదూరముసేయనెంచనే.

ప్రాణనాథా! ప్రాణనాథా! (గొల్లునయేడ్చుచు.)

సీ. ధరనుతింపగస్వయంవరముననునుఁదెచ్చి
వేడుకతో బెండ్లియాడినావు
కలనైనగట్టిగాపలికియెఱుంగని
ప్రేమతోనన్నాదరించినావు
యెన్నితప్పులుసేయమన్నించికృధలేక
మించెడికృపగారవించినావు
యలరిక్షీరోదకన్యాయంబుననుఁగూడి
యంచితసుఖముదేలించినావు.

గీ. కోరునవియెల్లనాకొడఁగూర్చినావు
హెచ్చుగాజూచిగౌరవంబిచ్చినావు
యట్టినిన్బాసియెటులుందునవనిమీఁద
నిపుడునీతోడిలోకమ్మెయేగుదాన.

ఓ? భగవంతుఁడా? ఓ! శ్రీహరీ? నిష్కారణంబుగ నామగనింజంపి నన్నన దంజేసి యేడ్పించి యుసురుఁ బోసుకొన నీకుఁదగునా? యాడుతోడుం బుట్టవా? నాకుపతిభిక్ష పెట్టవా? సర్వభూతంబులారా? నాప్రాణనాథునిఁ గాపాడరా?

సీ. ముల్లోకముల నేలుమూలవిరాట్టులై
పుట్టినయట్టి త్రిమూర్తులార!
యుదయాస్తమానముల్ మదిమఱవక నుమింటు
సంచరించెడుసూర్యచంద్రులార!
భగవత్స్వరూపులై బహుపుణ్యలోకముల్
పాలనసేయుదిక్పాలులార!
యాకలిదప్పికనవయక చిరంజీవు
లై వెలింగెడుదివిజాళులార!

గీ. కావరయ్య నానాథుని గరుణతోడ
గరుడగంధర్వయక్షకింపురుషులార!
ధర్మదేవతలార! వేదంబులార!
కావరే మాడ రే పెగబోవరా రె?

ప్రాణనాథా? పట్టెడుబొట్టు పసుపుతో మీ చేతిమీదుగా బోయెదననుకొంటినే గాని యిట్లుజరుగునని కలనైనం దలంపలేదు. పూర్వజన్మ పుణ్యంబులేకుండ లోకంబున నావంటి నిర్భాగ్యురాలికి పుణ్యస్త్రీ మరణంబు సిద్ధించునా? జీవితేశా? భూలోక రాజదేవేంద్రా?

గీ. జన్మజన్మంబులకునైన జగతినాకు
నిన్నుఁ బతిసేయుఁగాతవాణీధవుండు

చతు—" "యెన్నిజన్మంబులెత్తిననన్నుఁ దాంగి
నిన్ను సతిఁ జేయుఁగాతవాణీధవుండు.

(దుఃఖించుచు ధైర్యంబవలంబించి) తపస్వీమణీ? విచారింపకుము.

ఉ. ఉత్తమమైన క్షత్రియునకుర్విని బుట్టుకతోడ బోత్రిగా
నెత్తురుకూడు గానిధరణీశ! సుఖము ముందు నెతిన్నతిండిలో
పత్తువఁ జేయునే! తలపసంగరమందునఁ జావుదప్పునే
చిత్తమునందలంపననిజీవనమెప్పుడు మత్తకాసినీ!

అదియునుం గాక.

ఉ. ఎట్టిమహానుభావునకు నెంతటిపుణ్యునకైన నెంచఁగా
నెట్టిమహామహీంద్రునకు నెంతటిశూరునకైనఁ బుట్టినన్
గిట్టుటఁ దప్పదెప్పటికి కీర్తియె నిల్చును, పూర్వులెట్టులన్
గిట్టుచునూగుచుండిరొకొ? నాశమునొందక లోకమందునన్.

కమల—(విచారించుచు) కృష్ణుండు సాక్షాద్విష్ణుండుగాని సామాన్య నరుఁడు కాఁడు. ఆతనియెదుట బ్రహ్మరుద్రాదులైన నిలువలేరు. కాబట్టి యీ మెట్ట వేదాంతములఁగట్టిపెట్టి, శరణుజొచ్చిన నాతఁడు కాపాడఁగలఁడు.

చతు—(కోపముతో) హృదయేశ్వరీ! ఏమియుపాయంబు చెప్పితివి?

చ. నరపతులెల్లనవ్వఁగ, మనంబులబంధులుసిగ్గునొందుచున్
శిరములువంప, శౌర్యకులశీలములెల్లనువీటిఁబుచ్చి, య
స్థిరమగుమేనికై, భయముఁజెంది, వనంబులనాలమందలన్
గోటియలఁగాచుచుంబ్రతుకుగొల్లనికిన్ శరణంబుఁజొత్తునే.

క. హరిచేతరణమునంబడ
సురపురికేగుదునుమోక్షసుఖములఁగాంతున్
హరినాహవమునఁగెల్చిన
ధరనాచంద్రార్కకీర్తిఁదనరుదుతరుణీ.

ఎట్లయినను మంచిదే! జయాపజయంబులు దైవాధీనంబులుగదా.

కమల—మనోబాంధవా! అట్లయిన మనరాష్ట్రంబునంగల సకలసామంత రాజవర్గంబులను సహాయంబొనరించికొని యారాధనంబొనర్పుఁడు. సాహసేలక్ష్మియను సత్కృతి వాక్యమూరక పోదుగదా! (ఆలోచించి) నాథా! మాయాశ్వసై మనపుట్టుముంచినరంభ మీకు సర్వదేవతాకర్షణంబను నారాయణ మంత్రంబు పదేశించి యరిగినదని చెప్పితిరిగదా! దానివలన మీకుజయంబు సిద్ధించు. మీరిప్పుడు నిష్ఠాపరులై యామంత్రారాధనం బొనర్పుఁడు.

చతు—ప్రియామణీ! బాగుగాజ్ఞాపకముఁ దెచ్చితివి. ఆమంత్రోచ్చాట నారాధనఁ జెవ్వరు వినఁగూడదు.

కమల—హృదయేశ్వరా! మీకుజయంబగుఁగాత! నేనుపోయివచ్చెద.

(కమలాదేవి నిష్క్రమించుచున్నది.)

చిత్ర—పోనిమ్ము. సురలోకసంవాసినిగ్రమైన రంభనన్నింతవరకుఁదెచ్చినను, కీడులో మేలన్నట్లు, మత్రంబుపదేశించి పోయినది. దీనివలన మహాపరాక్రమంతుండని పేరుఁబొందిన, యింద్రునాకర్షించెదఁగాక! (అనిమంత్రంబుస్మరించుచు.)

మత్తకోకిల.—

బోవవేసురలోకపూజితపూతపాదసరోరుహా!
కావవే! త్రిదివాధిపా! సురకామినీహృదయప్రియా!
రావె! శౌర్యనిధాన! భూరిపరాక్రమోన్నతవిక్రమా!
దైవరాయ! కృపానిధీ! వరదాయకా! సురనాయకా!

(కొండ్లుమూసిజపించుచు.)

సీ. శిరమునకల్పకతరుపుష్పములతోడ
డంబుమీరెడికిరీటంబుతోడ
విరిదమ్ములంబోలువేయికన్నులతోడ
గేలఁబొల్పారుదంభోళితోడ
ననిశంబుగొల్చెడియమరబృందముతోడ
సరసమాడెడిశచీతరుణితోడ
దివ్యమాణిక్యసందీప్తదేహముతోడ
విధునినవ్వెడుముద్దునుదుటితోడ.

గీ. గరుడగంధర్వయక్షకింపురుషసిద్ధ
సాధ్యబృందంబుతోడహాసంబుతోడ
దర్పముప్పొంగనైరావతంబునెక్కి
యమరనాయక! నాకుప్రత్యక్షమగుము!

(ఇంద్రుఁడు సాక్షాత్కరించుచున్నాడు.)

చిత్ర—దేవేంద్రా! నమస్కారము.

గీ. అరయయజ్ఞాదిక్రతువులకాద్యుఁడెవఁడు
హవ్యకవ్యంబులకునెల్లనధిపుఁడెవఁడు.
స్వర్గసౌఖ్యంబులిచ్చెడిభవ్యుఁడెవ్వ
డట్టినినుఁగంటినఘములనడపఁగంటి.

ఇంద్రు-నరనాథా! కడుసంతసంబయ్యెడి. నీవునావలనంగోరు యభీష్టమెద్ది?

చతు--ఉ. నన్ననిమిత్తకోపిధముననందకుమారకుఁడావహంబులో,
బన్నుఁగ(డుంపఁగాఁ బ్రతినబట్టినఁగక్కున, నిన్నుఁగూర్చియా
పన్నుఁడనై జపించితినిభక్తినిసత్కృపఁజూపినన్నువే
గన్నులవేల్పః భీతిదొలఁగంగనుజేసియుఁగూర్మిగావవే.

ఇంద్రు—చతుర్థనా! చాలవిచారముగానున్నది కాని, సాక్షాద్విష్ణుండగు కృష్ణునితో నెదిరించి నిన్నుఁగాపాడఁ ద్రిలోకంబుల నెవ్వరుసమర్థులు!

మ. అరవిందాసనుచేవరాళిగొనిబ్రహ్మాండంబుచీకాకుఁగా
పరగంజేసినదేవవైరులనుశుంభచ్ఛౌర్యమొప్పంగ, భీ
కరచక్రంబునమాటమాత్రమునభంగంబొందఁగాఁద్రుంచెనా
హరినింగెల్చుట?నీకు, నాకు, దరమే! యాయోధనోర్వీస్థలిన్.

మఱియుఁ జెప్పుటకు సిగ్గుచున్నను, నీకొకసంగతి దెల్పెదవినుము.

మ. తనభామామణిసత్యభామకువినోదక్రీడకై స్వర్గమం
దునఁబొల్పారెడిపారిజాతతరువున్ దోర్దర్ప మొప్పంగ, గొం
చునుబోవన్ గనినేనుమార్కొనఁగనన్ గోపించి, ప్రాణావశి
ష్టునిఁగాఁజేసినకృష్ణుగెల్చినిరతుంజేయనాశక్యమే?

చతు---పురందరా! దేవకీతనయుండగు కృష్ణునకును, నీకునురణం బెట్లుకలిగినది? విన వేడుకగుచున్నది.

ఇంద్రు-రాజా! ద్వారకలో కృష్ణుడొకనాడు రుక్మిణీగృహంబుననుండ బదరికాశ్రమ వాసులగు భరద్వాజ, కణ్వ, కశ్యప, వశిష్ఠ భృగు వామ దేవాదిమునులు, దర్శింపనేగిన వారలంజూచి యాగమన కారణంబడిగిన వారునరకాసురబాధం జెల్పి దుఃఖింప, రక్కసుందునుమ(ప్రతినఁబట్టి, మునులకభయహస్తంబిచ్చి, పంపించి, సత్యభామతో గరుడారోహణం బొనర్చి, ప్రాగ్జ్యోతిష పురంబున న

రకునిసంహరించి, కుండలంబుల నతికినిచ్చి, దివంబున దివసత్రయంబు వసింప నొకనాడు శచీదేవి, సత్యభామను విందునకుఁ బిలుచుకొనిపోయి, సరససల్లాపంబులఁ బొద్దుపుచ్చుతఱి నామె చేత పారిజాతప్రసూనంబులం గాంచి సత్య యిమ్మనివేడ, స్వర్గపుష్పంబులు మనుజసతులకివ్వఁగూడదని బదులుసెప్పినఁ, గోపించి విడిదికరిగి, కృష్ణునితోఁ దెల్ప, నాతండు శచీగర్వంబుడిపి, పారిజాతంబు పెకల్చి తెచ్చి, గరుడినిపై బెట్టి సత్యతోఁగూడ పోవుచుండ దంభోళితో నేనడ్డుపడి యెదుర్కొన నాపీచంబడంచెను. కాన నానరకాసురభంజను నే నుజయింపజాలను. పోయివచ్చెద. ఇఁక నన్నుఁబిలచిన నిన్నుశపింపక మానను. (అంతర్ధానమగుచున్నాడు.)

చతు—(నవ్వుచు) ఆహా! ముక్కోటిదేవతల కధిపతియనియు, బహుశౌర్యవంతుండనియు, వినిశరణంబువేడ, సిగ్గులేక, కృష్ణునిజయింపం జాలననియు, నేనుమరల పిలచి బాధింపకుండ శపింతుననియుఁ జెప్పి భయపడి పాఱిపోయెను. ఏమి యీతనిశౌర్యము?

సీ. కేలనున్నట్టిదంభోళి రాల్మలపఁగ
ధరియించెశత్రులఁదరుగఁగాదు
వేశ్యలయందంబువీక్షింపవేఁగన్ను
లనుఁదాల్చెనరిఁజూచుటకు గాదు
గౌతమఋషిపత్ని కౌఁగలింపఁగఁ దెల్వి
గలదంతె! రణమున దెలివి లేదు
మునులపై యధికారమునుజూపుటకెగాని
వైరులపైఁజూపపనికిరాదు.

గీ. యింద్రుఁడననేమొయనుకొంటినిపుడు తెలసె
నట్టిడాంబికమేకానిబలమునున్న
యిట్టివానికిసురరాజ్యమిచ్చినట్టి
వెఱ్ఱిపరమేష్టిసనవలెవీనినేల!

ఇతనివల్ల నేమోయగునని నిష్కారణంబుగా మాటఁబోగొట్టుకొంటిని. (విచారించుచు) ఇఁక నన్నుఁగాపాడ సమర్థులెవ్వరు? (ఆలోచించుచు) మరల రంభాప్తమంత్రప్రభావంబున బార్వతీశు నాకర్షించెదఁగాక! (మంత్రంబుజపించుచు.)

సీ. తెల్పుపై నతల్పపైనిపాలుపారుగంగతో
కలితమౌ నెలవంకచెలువుతోడ
గడుమలినంబైనగరళకంఠముతోడ
కేలనుముమ్మొనవాలుతోడ
నురసీమనొప్పెడియురగహారముతోడ
విమలంబులౌకుండలములతోడ
లోకపరినుతియింపనుబ్బుడెందముతోడ
ప్రకటకపాలమాలికలతోడ.

గీ. ప్రమథగణములుభక్తితోబ్రణుతులిడఁగ
వెల్లయాబోతుపైనెక్కియుల్లమలర
హైమవతిఁగూడిహాస్యంబులాడుకొనుచు
నాకుబ్రత్యక్షమగుము! పినాకపాణి!

(శివుఁడుసాక్షాత్కరించుచున్నాడు.)

శివు—రాజేంద్రా! నీవాంఛితంబెద్ది?

చతు—(నమస్కరించి.)

ప్రియంవదావృత్తము.—

కనుమిదిజనార్దనుఁడకారణముగాన
న్ననిమొనవధింతుననియాగ్రహప్రతిజ్ఞన్
గొనఁగననుగాతువనికోరితినినిన్నున్
మునివినుత! రుద్ర! ననుబ్రోవుముబిరానన్.

శివు-ఉ. భూవర! కృష్ణుతోఁదొడరిపోరిరణస్థలిఁగందకుండనిన్
గావఁగఁజాల! బాణకదనంబుననాతనిబాణశక్తియున్
జేవయుఁగంటినేరికినజేయుఁడుచక్రముజేతనందినన్
నీవునునేనుఁబర్విడక, నిల్వఁగశక్యముగాదునమ్ముమా.

చతు—రాజశేఖరా! కృష్ణునకును నీకును సంగరంబెట్లు కలిఁగినది చెప్పుము.

శివు—రాజశేఖరా! మద్భక్తుండగు బాణాసురుని కొమార్తెయగు నుషాసతీమణి కలలోఁగాంచిన యనిరుద్ధుని రావించి, యాతనితోఁ గలయు బెట్టింగి, యాతని పైరణంబునకుందొడర, నారదునివలన శ్రీకృష్ణుండెరింగి, యనికిగడంగిన, నాభక్తుండు నన్ను సహాయంబుఁ గోరవల్లెయని, నేనాతనితో బోర, తనచక్రంబున బాణుని సహస్ర కరంబులు ఖండించి, నన్ను చిక్కువరచి, చివరకు యుంషాకన్యను ద్వారకకుఁ దీసికొనిపోయె. కావున నేను నిన్నాతని బారికుండి తప్పింపఁజాలను. నాయానవిడచుకొనుము. నేనుపోయివచ్చెద. (నిష్క్రమించుచున్నాడు.)

చతు—ఆహా! యింద్రుని బిలచిననట్లయ్యె, హానీశివుని బిలచిన నిట్లయ్యె.. (కోపముతో) యాదవుండగు కృష్ణునిజయింపభీతివడి పారిపోయిన దైవంబుల మిమ్ము చూచితిని. ఆహా! శంకరా! ఏమి! నీపౌరుషము?

సీ. నగమాడుఁదనముతోసంచరించెడునీకు
  శూలమెందులకొకోకేలఁదాల్ప
నెల్లరునగబిచ్చమెత్తుజోగికినేల!
  పౌరుషంబైనట్టిపాశుపతము
చెలఁగిస్మశానములసేవించునీకు ది
  క్పాలనంబిచ్చెనెవ్వండుచెపుమ
పరిపంధితోబోరనరుగువీరునిఁబోలె
  గవచాస్త్రతూణీరగణము లేల?
గీ. ప్రమథభటులేల! నీప్రభుత్వంబదేల?
పరశువనబ్రహ్మాండంబుబ్రద్దలగున
టంచురమ్మంటిగానియాయదుకులునకు
భీతివడుదంచుఁదెలియనిఁబిలతునొక్కొ!

ఆహా! ఇంతబ్రతుకు బ్రతికి తుదకింటివెనుకఁ జచ్చినట్లు నాకొకగొల్లవాని చేతులోఁ జావవలసి వచ్చెనుగదా! (ఆలోచించుచు) దైవమా! ఇంకమిగిలినవాడు బ్రహ్మ, ఆతనిగూడ నామంత్రబలంబున నాకర్షించి చూచెదఁగాక!

(మంత్రంబుజపించుచు.)

చ. పలుకులబోటితోఁ, బసిడివన్నెలతోఁ దులదూఁగుమేనితోఁ
బులుఁగుపయిమాయితోఁ దక్రతుభుక్తతికొల్చెడుమూర్తితోఁ దతో
ల్పలుకులుపుట్టినట్టిముఖపద్మముతో మురిపెంపునవ్వుతో
నలువుగ నాచతుర్ముఖుఁడు నాకుఁ గనంబడుఁగాత! సత్కృపన్.

(బ్రహ్మసాక్షాత్కరించుచున్నాడు.)

బ్రహ్మ—నరనాథా! నీవు నావలనం గోరు యభీష్టమెద్ది?

చతు—(నమస్కరించి చేతులుఁ జోడించి)

చ. వనరుహగర్భ! కర్మగతిః వారిజనాభుఁడు కారణంబుగా
నని మొనద్రుంతునంచు విబుధాళివినంగఁ బ్రతిజ్ఞఁ బట్టెగా.
వున నెట్లైన, నీకరుణబోవుము నీశరణంబుఁ జొచ్చితిఁ
ఘనమగుకీర్తి కల్గునను గావుము లోకము లెల్ల మెచ్చఁగన్.

బ్రహ్మ—(నవ్వుచు) క్షోణీవల్లభా! మంచివానిం గోరితివి.

సీ. పురిటింటిపిల్లఁడై పొల్పారి పూతన
రక్కసిఁ బడవైచి నిక్కినాడు
పసిబిడ్డడై యుండి బండియై వచ్చిన
శకటాసురునిఁ బట్టి చంపినాడు
యేడాదిబుడుతఁడై యింపారి కొంపోవు
కడిఁదితృణావర్తు గెడపినాడు
పుడమిపై నడుగిడి నడచుపాయమున మ
ద్దులనవ్వుచును వీడదోచినాడు.

గీ. బకుని వత్సాసురునిఁ బడవైచినాడు
చిలువయైయున్న దానవుఁ జీరినాడు
వత్సహరణుని నను భంగపరచినాడు
వాని గెలువంగ నావశంబా! నరేంద్ర!

చతు—వాణీశా! అద్భుతంబయ్యెడి! సృష్టికర్తవగు నీవాతనిచే నెట్లు భంగపడితివి?

బ్రహ్మ—రాజా! ఒకనాడు శ్రీకృష్ణుం డాలమందల మేపుచు బృందావనంబున గోపికలతోఁ జల్దులఁ గుడువఁబోవ నాతని మహిమం బెరుఁగందలంచి యావులను, లేగలను, గోపికలను, గోపబాలురను మాయముఁ జేయ నాతం డెతింగి

తానేవత్సంబులును, తానేగోపికలును, తానేగోపబాలురున్నై జనమ్మెం నర్చుచుండ, నొకసంవత్సరంబగుడు, వచ్చిననాడు చతుర్భుజాకృతితో చక్రకౌమోద కీశార్ఙ్గకరుండై, కౌస్తుభోరస్కుండై, ప్రతిబాలవత్సంబులును గనంబడ, నేనమ్మహాత్ముని చరణంబుల కెరగి నేవొంగిలిన వానినన్నియు నాపాలదొంగకిడి మరలితిఁగాన నిన్నాతని బారినుండి నేను కాపాడజాలను.

(అంతర్ధానమగుచున్నాడు.)

చతు—బ్రహ్మశివేంద్రులన, నేమోయనుకొంటిని. ధీరవట్టినేతి బీరకాయలు. (విచారించుచు) హా! దైవమా! ఇఁకనేమిసేతు! ముల్లోకంబులకు దిక్కగువారే దిక్కులేకపోయిన యింకనన్ను రక్షింపదిక్కెవ్వరు,

(నారదుఁడు ప్రవేశించుచున్నాడు.)

నార—తరళవృత్తము.

జలజలోచన! దానవాంతక! జానకీహృదయప్రియా!
కలశజాదిమునీంద్రవందిత! కౌశికాధ్వరరక్షణా!
ఖలనరాసురభంజనా! దశకంధరాంతక! కేశవా!
కలితకోసలరాజనందన! కావుమా! ననురాఘవా!

చతు—(పరుఁగిడుచువచ్చి పాదంబులమీఁదవ్రాలి దుఃఖించుచు.)

ఉ. నారదమౌనిచంద్ర! సురనాథుఁడుశూలియు, సృష్టికర్తయున్
బారిరికృష్ణమూర్తిగెలువన్ దమశక్యముఁగాదటంచు, నె
వ్వారికదిక్కు, దారికనుపట్టదు. మంచియుపాయమొద్దియో
వారకఁజెప్పుదాకతమపాదములన్విడఁనాడఁజెప్పుమా.

నార—రాజేంద్రా! లెమ్ము. లెమ్ము.

చతు—చెప్పుదునని వరంబిచ్చెదు దనుక లేవను.

నార—(నవ్వుచు) తప్పకనీకుపాయం బెరింగించెద లెమ్ము.

చతు—(లేచుచున్నాడు.)

నార—రాజా! ఏలయింత జేలవై పౌరుషంబును ధైర్యంబునుఁ గోల్పోయెదవు? కృష్ణుని నీవుజయించుతెరవు నీకుదెల్పువాఁడను. చింతింపకుము.

చతు—సురమునీంద్రా! బ్రహ్మరులే జయించలేని కృష్ణుని నేనొక్కడ నెట్లుగెలుతును!

నార—నేనుచెప్పిన చొప్పున జేయుము. ఏమన. మహాపరాక్రమోన్నతుండగు, నర్జునుండు, వేటకేఁగి, యొక్కలేడిచే భంగపడి, దానిని వెదఁకుచు, బాణాసన పాణియై, వడఁగొట్టి, దారితప్పి, దాహంబునకై నీరంబువెదకుచు, నిచ్చటికిఁ గూతవేటు దూరంబుననుండి పోవుచున్నాడు చూడుము. (చూపించుచు) నీవాలస్యముసేయక బోయి శరణని పాదంబులంబడి ముందుకృష్ణునిమాట చెప్పకుండ, మిషఁబెట్టి, యాతనిచే, రక్షింపవాగ్దానంబు సేయించుకొని, మరియు నీవృత్తాంతముచెప్పిన నీయభీష్టము నెరవేరును. నేనుపోయివచ్చెద, (నిష్క్రమించుచున్నాడు.)

చతు—(సంతోషముతో) నారదా! కలహాభోజనా! ఏదియైన నూహానీకే తోచవలెఁగాని త్రిలోకంబుల నింకొకనికీ తెలివి తేటలెక్కడివి. ఈచాతుర్యమెక్కడిది. (దూరంబుగా పోయిచూచుచు) మంచిది. త్రిలోకవీరుండగు నర్జునుండుకూతవేటు దూరంబుననేయున్నాడు నేనిప్పుడేపోయి యాతనిఁగలసుకొందునుఁగాక!

(నిష్క్రమించుచున్నాడు.)

(అర్జునుఁడు బాణాసనపాణియై, పరుగిడుచు ప్రవేశించుచున్నాడు.)

అర్జు—(వగర్చుచు) ఆహా! దుష్టమృగంబెంత దూరంబలయించి తెచ్చినది?

బంధురవృత్తము.—

హరికరములవడఁబొడమెనుకడుదాహంబొదవెఁ శ్రమనొందితిహా
చరణములధరణిపయినిడినడువంజాలకయుంటిని, కెందులకా
హరిణమువెతకుటకనుపడదికనేడక్కటనీరసముంగనివే
సరిత్తినిబడలితిబలముదరిఁగెనీచల్లనినీడనునిల్చెదగా!

ఆహా!

ఉ. చల్లనిగాలిసోకినను చల్లనిచెట్టులనీడగాంచినన్
జల్లనిమంచినీళ్లఁగనఁజాలినప్రాణములేచివచ్చె, మే
నల్లనుఘర్మబిందులుదయించెను, పాంధులపాలిబంధులై
యల్లనహాయిహాయిగమదాళులుఝుంకృతిసల్పెడిచ్చటన్.

[తెఱలో]

మాంపాహి. మాంపాహి. త్రిలోకవీరా! యింద్రనందనా! మాంపాహి.

(వినుచు నాశ్చర్యముతో) ఏమిది. ఈయార్తధ్వని యెవ్వరిదై యుండనోపు. ఏఋషీశ్వరుల కేమహాత్ముల కేమియాపదవాటిల్లెనోకదా! (చేతులెత్తి) యెవ్వారెవ్వరు! ధర్మరాజసోదరుండగు నర్జునుండు బ్రతికియున్నాడు. ఏవ్వరో భయంపడకుడు. భయంపడకుడు. నేనిదేవచ్చుచుంటిని. (లేచుచున్నాడు.)

చతు—(పరుగిడుచు దుఃఖించుచు, వచ్చియర్జునునిపాదములపైబడి.)

చ. శరణుమహాత్మ! సర్వనృపసన్నుత! పాండునృపాలపుత్రకా!
శరణుసుపర్వపూజిత! ప్రశస్తయశోధన! వైరిమర్దనా!
శరణుకృపాళు! దీనసురసాల! మహోన్నతసద్గుణాకరా!
శరణుత్రిలోకవంద్య! హరశౌర్య! ధనంజయ! నన్నుగావుమా.

అర్జు—(ఆశ్చర్యముతో) ఏమిది! పాపమీరాజచంద్రునికెట్టి మహాపాయము వచ్చెనోగదా! (తట్టుచు) రాజా! భయపడకుము. లెమ్ము.

చతు—(దుఃఖించుచు) పుణ్యస్వరూపా! నాకీయాపత్సముద్రంబు దాటింపవచ్చిన సాక్షాద్విష్ణుండవుగాని కేవలనరుండవుగావు. నాకీయాపదం గడ తేర్తునని నను భయహస్తంబిచ్చినంగాని నీపాదంబులు విడువను.

అర్జు—రాజా! కారణంబేమి?

చతు—(తొందరతోవణకుచు)

గీ. బలియుండొక్కడునను జంపబ్రతినబట్టి
వచ్చితినినీదుశరణంబుజొచ్చినాడ
తెరవులేదింకనీ వెనాదిక్కుసుమ్మ
మహితకృపతోడరక్షించుమా! మహాత్మ!

అర్జు-ఉ. భూవరభీతినొందకుము, ప్రోచితి? కాచితి, మాటనమ్మునీ
కేవిధమైనలోటుజనిఋంపదుచూడుభవద్విరోధులన్
జేవయడంచిగాంఢీవము చేరణభూమినింగూల్చిలోకసం
సేవితుంజేతునర్జునుండు సేయుప్రతిజ్ఞకు మోసమున్నదే.

రాజా! లెమ్ము

చతు—(దుఃఖించుచు) పాండవమధ్యమా? ఆబలియుని బారినుండి తప్పింతునని గట్టిగా నాకభయప్రదాన మిచ్చినంగాని నాప్రాణంబులు నిలువవు, హా? పార్థా! హా? ఫల్గుణా! నాకుమొదలు గడగడ వడంకుచున్నవి. నాలుకతడబడుచున్నది. మాటరాకున్నది. యాపద్బాంధవా? దీనశరణ్యా?

అర్జ—(కోపములో) రాజా? లెమ్ము. నేనుకావ నీకు భయంబేల? చింతింపకుము. త్రిలోకంబుల నిన్నెవ్వరు కన్నెత్తిచూడగలరు.

మ. ధరణీనాథులమాటజెప్పకుమమర్త్యశ్రేణియేవచ్చినం
తరణోర్వీస్థలిచండగాండివముచేతన్ద్రుంచి, నిన్ గాతునీ
తెరగుందప్పినపంచభూతయుతధాత్రీసాక్షిగానమ్మునా
శిరముంగోసియొసంగెదన్ భువనముల్ చింతిల్ల రాజేశ్వరా!

లెమ్ము. (లేవదీసి) ఇంకనీవు మనఃఖేదంబు దక్కియుండుము. పార్థుననుండియు, నొకమాయ మృగవధార్థంబు తిటిఁగి తిటిఁగి యలసియున్నాడను. కొంతతడవిచ్చట నిద్రించెద. (నిద్రించుచున్నాడు.)

చతు—ఇప్పటికి బ్రతికితిని. ఈతండు నన్నుఁగావ ఘోరప్రతిజ్ఞఁజేసియున్నాడు. ఏరోజున నాకృష్ణుప్రతిజ్ఞ వింటినో యప్పటినుండియు, బడరాని యవస్థల బడితిని. పట్టరాని పాదంబుల బట్టితిని. నాకష్టంబులు గట్టెక్కినవి. కాని, మనంబుననొక్క సందియమున్నది. నాకు వైరికృష్ణుండని నిజముగా నీతనికి జెల్పక, మిషఁబెట్టి గట్టిగాప్రతిజ్ఞఁ జేయించుకొన్నాడను. మొదటకృష్ణుండే నాకు వైరియనిదెల్పిన, నీతఁడు నన్నుఁగావడుకదా? ఈతండు నిద్రలేచి నీకువైరి యెవ్వండనియడిఁగిన, జెప్పకతప్పదుకదా? అయ్యో? చెప్పిననేమి కొంపములుఁగునో? కానిమ్ము. అంతవరకువచ్చిన గొల్లనిచేతిలోఁ జచ్చుటకంటె నుత్తమక్షత్రియుండగు నీతనిచేతిలోఁ జచ్చుటమేలు.

అర్జ—(దిగ్గునలేచి) ఏమి? ఈదుస్వప్నము? పార్థప్రియుండును బాంధవుండునగు శ్రీకృష్ణునితోడఁ దొడరి, యనేకాక్షౌహిణీ బలంబులతోఁగూడి సమరంబొనర్చి ధర్మసుతుండొక్కరుండుతప్ప, తక్కినవారమందరము, శ్రీహరి చక్రధారచేమడసి తుదకాతని కృపచే మరలబ్రతికితిమట, ఏమిది? దీనికిఁతోడు యెడమకన్నుకూడ నదురుచున్నదే. (విచారంచుచు రాజుంజూచి) రాజా? నీపేరెవ్వరు? నీయూరెద్ది?

చతు—ఇంద్రనందనా? చతుర్థుండనువాఁడ? ఇచ్చటికికొలఁదిదూరంబున నుండిన కుండినపురంబున కధీశుండను.

అర్జ-ఉ. ఆరయనీకువైరియెవఁడాహవమందుఁబ్రతిజ్ఞఁబట్టగా
గారణమేమి? భీతిలఁగగారణమేమొకో? యిట్టికష్టముం
గారణమేమి? నీయెడలఁగల్గిననేరమదేమి! సత్వరన్
ధారుణినాథ! చెప్పుము మొదల్గానియంతముదాకదాపకన్.

చతు—(వడఁకుచుఁ చేతులుజోడించి) రంభగుఱ్ఱమై వచ్చు టెరుంగక దానినధిష్టించి పదునాల్గులోకంబులదిరిగి వచ్చుచుండ గుఱ్ఱపునోటినురువు యమునానదిలో కృష్ణునిచేతిలోబడ నేలలో నన్ను జంపెదనని ప్రతిజ్ఞపట్టెను. అంత నీవృత్తాంతంబువిని బ్రహ్మరుద్రేంద్రుల రంభాదత్తమంత్ర జలంబున నాకర్షించిరక్షింపఁగోర వారుమాశక్యముగాదనిపోయిన తుదకు జగదేకవీరుండవగు నిన్నాశ్రయించి నీచేరక్షింపఁబడితిని. మహాత్మా? తప్పుసైరింతువుగాక?

అర్జు—(దుఃఖముతో) హాకృష్ణా! హాకృష్ణా! హా? పాండవపక్షా! (అనిమూర్ఛిలిలేచి) హా! యాపద్బాంధవా? హా! కృష్ణా? హా! బావా? స్వప్నమెంతని జంపైనది. ఎడమకన్నదరిన లాభంబు కానుపించినదే?

గీ. ఇంటఁదినియింటివాసంబులెంచుపగిఁది
నీదుకృపనింతవాడనై నెగడితుదకు
నిన్నెదుర్కొనినీతోడనిష్ఠురముగ
బెనఁగిబాంధవ్యమునువీడు చెనటినైతి.

బావా! నీక్షేమెట్లుమరతును?

సీ. నీచేతనేగదానిఖిలలోకములందు
వీఁడనికీర్తితో వెలసినాడ
నీచేతనేగదానిఖిలావనీంద్రులు
మ్రొక్కంగబలిమితో నిక్కినాడ
నీచేతనేగదా! నిన్నమొన్నటిదాక
కష్టంబులనుదాటగల్గినాడ.
నీచేతనేగదాభూచక్రమునమూకు
నడ్డుగల్గదటంచునలరినాడ.

గీ. నరయనీచేతనేగదా! గరుడగమన?
జ్ఞాతిదౌష్ట్యంబులకునిల్వఁజాలినాడ
నంతబంధుఁడవగుటచేనింతపనికి
దొడరినాడకృతఘ్నునై తోయజాక్ష!

ఉ. ఏవిభుమూలమైజగము లేడునునిల్చునుభూతసంచయం
బేవిభుమాయచేఁ బలయునిబ్బవిభారమడంపలోకమం
దేవిభుఁడుద్భవించె! సురలెల్లనుతింపఁగనాకుమిత్రుఁడై
యేవిభుఁడొప్పెనట్టిహరికెంతటివైరముఁదెచ్చితక్కటా!

ఉ. అంచితమైనప్రేమవిడనాడకశైశవమాదినొక్కటే
కంచమునన్ భుజించితిమిగారవమొప్పఁగ రేలనొక్కటే
మంచమునందుబండితిమి. మైత్రిని. నంతటివారినక్కటా
క్రొంచకమాయయుద్ధమునఁగూల్పఁగ నెంచితె,మాయదైవమా?

గీ. బాల్యమాదినిమిత్రుఁడై బంధుఁడగుచు
కంటికినిరెప్పలీలగాఁ గాఁచునట్టి
వాసుదేవుండు వైరిగావలసెనెంత
కుంతికానుపుదురదృష్టవంతులైరి.

అన్నా? నేడెట్టిదుర్దినంబయ్యె. లేచునప్పుడెవరిమొగముఁ జూచితినోకదా?

శా. ఆలోచింపకముందువెన్కలకుమూఢాత్ముండనై మీరినే
నేలాచేసితినీప్రతిజ్ఞ! హరితోనేరీతిపోరాడిభూ
పాలుంగాతును, బంధువర్గములనెప్పాటన్ గనుంగొందునా
ఫాలంబందుననున్నదాతలిపిమెబ్బంగిన్ బ్రవర్తిల్లునో.

హా! కృష్ణా! హా! పాండవపక్షా!

సీ. నీతోవిరోధించినిరుపమ దేవకీ
వసుదేవులకునార్తిబరపినాడ
నీతోవిరోధించిపూతచరిత్రయౌ
కుంతికిగడుచింతఁగూర్చినాడ
నీతోవిరోధించినిర్మలులౌధర్మ
తనయులకిక్కట్లుదార్చినాడ
నీతోవిరోధించినిఖిలయాదవులకు
గర్భశత్రుండనై గ్రాలినాడ.

హా జగద్రక్షకా! బావా!

గీ. నరునకిప్పుడుకుడిచెయ్యివిఱిఁగిపోయె
చెరువునకు బైటబడినట్టి చేపలగుచు
పాండవులుపట్టుచెడిపోయిబయలుపడిరి.
నీవిరోధంబుననునేడునీరజాక్ష.

నిష్కారణవైరంబీ నృపుండుకల్పించినాడు.

ఉ. వైరివినీవటంచప్పుడుపల్కకనన్ మిషబెట్టిచెప్పియా,
ఘోరప్రతిజ్ఞసేయబురికొల్పిన, నీమెడతప్పజేసి, మా
కారడిదెచ్చినీకుఁగడునార్తినిగూర్చితిఁగానఁ, కూర్మినీ
నేరముగాయభారమిఁకనీయదెసుమ్ము? త్రిలోకవందితా!

ఆహా! విధీ? ఎంతటివానికిని దినములొక్కరీతిగా జరుగనియ్యవుకదా! ఎవ్వారికిని నిన్నుగడువ దుస్తరంబుగదా! బావా! నేననిన పంచప్రాణంబు లిచ్చుచుందువు! నిన్ననేగదా నన్నుఁజూడ వలెనని యున్నదనియు, నెంతపనియున్న నొక్కసారి రమ్మనియు, నుద్ధవునిచే వార్తనంపితివి. రేపో నేఁడో నీసన్నిధికరుగ వలెనని సంతసించుచుండ నేటిదినంబున నీపాదుపేటవలన నిట్టియవాంతరము పుట్టెను. నీకువైరినై, నీతోవిరోధింప బ్రహ్మ మూడుపంక్తులంబెట్టె, నానాసటవార్తలతో ముచ్చటించుటలబ్బునా! నీకును నాకును నేటిరోజుతో స్నేహంబు వదలిపోయెగదా! మొక్కబోయిన గుడివిఱిఁగి మీఁదఁబడినట్టి శరణాగత రక్షణంబునని ట్టెవిడచుకొంటిగదా. ఆహా! ఎంతనిర్భాగ్యుండను.

మ. అరయన్ గష్టసుఖంబులందెపుడుమాకత్యంతబాంధవ్యుఁడై
గురుఁడై, తండ్రిసమానుఁడై, యనుజుఁడై, గుర్తింపగా దైవమై
పరమస్నేహితుఁడైన కృష్ణునకునేప్రత్యర్థినై మెట్టులీ
ధరణిన్ నిల్తును, ప్రాణముల్గలిగిధాతవ్రాతకేమందికన్.

అదియునుంగాక!

సీ. వనజగర్భునియంతవాఁడునువనమున
మోసముచేసితామోసపడియె
వామదేవునియంతవాఁడునునిజభక్తుఁ
బ్రోవలేకనుతానుచేవదరిగ

స్వర్గాదిపునియంతవాఁడునురణమందు
నెదిరింపఁబోయి తాఁబెదరిపారె
వనధీశ్వరునియంతవాఁడునుఁగడుభక్తి
డింభకునిచ్చి తాఁడంబముడిగె

గీ. వైరిరాజులమాటచెప్పంగనేల!
ఆర్తరక్షణుఁడవతారమూర్తికృష్ణుఁ
డతనికేనెంత! నాదుశౌర్యంబదెంత?
కలననాతనినేనెట్లుగెలువనేర్తు.

(ఆలోచించుచు) మించినదానికి విచారించిన లాభమేమి? కానిమ్ము;

గీ. సమరమందునఁజక్రిచేఁజత్తునేని
వీరత్రిదివసుఖంబులఁజూరఁగొందు
కలహముననాకునుజయంబుగలిగెనేని
యార్తరక్షణుఁడనుకీర్తినలరువాఁడ.

చతు—(భీతితోవడకుచు) మహాత్మా! యర్జునా! నన్నురక్షింప నీదేభారము.

అర్జ—(చేరఁదీసి) రాజా!

కమలవిలసితవృత్తము—

అడుఁగులుతడఁబడనడలకెడందన్
గడగడవడఁకకుకడిమివిడంగాన్
జడుపకువిడువనుసడలకుచింతన్
బుడమియొడయడవుబుద్ధితలంపన్.

(తనలో) ఏదియెట్లు జరుగనున్నదో యట్లు జరుగకమానదు. కృష్ణునితో రణంబు వచ్చునని శరణార్థిని విడుచుట నావంటి వీరునకు లక్షణంబు కాదుగదా! అస్థిరంబగు నీదేహంబున గాసించి, లోకంబున నాచంద్రార్కమై నిలచు పౌరుష కీర్తిధనంబులఁ బోఁగొట్టుకొందునే?

చ. శరణమటంచువచ్చితనచాటునడాగినవానిఁగాచినన్
జిరతరకీర్తిసద్గతులుచేకురు, మున్నొకపావురంబుకై
వెరువకకోసి నెత్తురులువెల్లువలై భువిపార, దేహమున్
ఛురికనుగోసిడేగకిడిశోభిలఁడే? శిబిదివ్యకీర్తితోన్.

చ. మలయుతమాకళేబరముమానుగనిల్పుటకంటెనోట్టితో
బలికినమాటనిల్పగనుపాటిలుకీర్తిధనంబపారమై
దలపఁగనన్నమాటజవదాటకదేవతలెల్లమెచ్చఁగా
చెలువగుదేహమర్పణముసేయఁడె? మున్నుదధీచికీర్తితోఁ.

క. శతతురఁగమేధయాగము
లతులితదానంబులెవ్వియైననుశరణా
గతునింగాచినఫలమున
కతిహీనములండ్రుయోగ్యులైనమునీంద్రుల్.

త్రికరణశుద్ధిగా కృష్ణుని చక్రంబుచేత నేను శిరంబుఁగోల్పోయినను, లేకనే ను హరింజయించినను శరణాగతుండగు నీచతుర్థనుని గాచెదగాక! కావున నేనిప్పుడు పోయి, యావృత్తాంతము ధర్మరాజాదుల కెఱింగించి, యాలోచించెద. తరువాత దైవమున్నాడు. (రాజుంజూచి) రాజా! ధన్యుండవైతివి. నీవిపుడు పురంబునకేగి సకలసైన్యసమేతుండవై, ధర్మజుచెంతకు నింద్రప్రస్థపురంబునకురమ్ము.

చతు—(చేతులుజోడించి) మహాత్మా! గడువు కొద్దిదినంబు లున్నది. కావున రక్షించినన్నెపుడు రమ్మనియెదరో శెలవిడుదురుగాక!

అర్జు—రాజా! ఆలస్యమేల? రేపటియుదయంబునకురమ్ము. కర్తవ్య మాలోచింతము. నేనుకడుదూరంబరుగవలె.

చతు—చిత్తము. మీకు క్షేమంబగుగాత!

అర్జు—(నిష్క్రమించుచున్నాడు.)

చతు—(సంతోషముతో) నేఁటికిఁబ్రతికితిని. ఇఁక నాకు ప్రాణభయముండకూడదు. కావున సర్వసేనాసమేతుఁడనై యుదయంబున బోయెదఁగాక!

(నిష్క్రమించుచున్నాడు.)



శ్రీగురుభ్యోన్నమః.

# విచిత్ర భారతము.



## తృతీయాంకము - ప్రథమరంగము.

ఇంద్రప్రస్థపురము—ధర్మరాజుసభ.

(ధర్మజ, భీమ, నకుల, సహదేవులు ప్రవేశించుచున్నారు.)

ధర్మ—తమ్ములారా! కరినగరంబునకుఁ బంపిన గూఢచారులు వచ్చిరా!

భీమ—అగ్రజా! ఇప్పుడేవచ్చిరి.

ధర్మ—తమ్ముఁడా! అచ్చటివింతలేమి?

భీమ—నిన్నటిరేయి భీష్మాదులువినుచుండ బాండులతో విరోధంబు కూడదనియు, బాలుపంచి పెట్టుట మంచిదనియు, ధృతరాష్ట్రుఁడెన్నిరీతుల బోధించినను వినక నీర్ష్యాలాపంబులాడు దుర్యోధనునింజూచి విదురుండు సాపువచనంబుల హితోపదేశంబు జేసెనట.

ధర్మ—పాపము. ఇందులో ధృతరాష్ట్రుని తప్పేమున్నది! అతండు న్యాయపథంబున నడిచె. తరువాత!

భీమ—తరువాత కర్ణ దుర్యోధను లిరువురు రహస్యంబు లాడికొనుచు, వెడలిపోయిరట. ఇదియే నిన్నటి సమాచారము.

ధర్మ—కర్ణ దుర్యోధనాదుల రహస్యాలోచనలకుఁ గారణంబేమైయుండును?

నకు—అన్నయ్యా! దురాత్మర్గుల యాలోచనలకు మంచిచెడ్డలును, కార్యాకార్యము లుండునా!

సహ—ధర్మసంభవా! కానిండు. వారియాలోచనలు తెలియఁబడగలవు. తొందరేల?

(అర్జునుఁడు దుఃఖించుచు ప్రవేశించుచున్నాడు.)

అర్జు—అన్నయ్యా? నమస్కారము.

ధర్మ—(తొందరతోలేచి కౌగలించుకొని) అర్జునా!

ఉ. చెన్నుగశత్రురాజినని జెండుచు జీల్చెదునప్డు, బాణముల్
వెన్నునదూరనప్పుడరిభీరులుచుట్టునుజుట్టినప్పుడే
వన్నెయుబాయనట్టిముఖపద్మము నేడిటు, వాడిదీనమై
కన్నులభాష్పముల్ గురియఁగారణమేమి? యనుంగుతమ్ముఁడా.

అర్జు—(దుఃఖించుచు)

చ. మనలను గూర్మితోఁ గనుచు, మన్ననజూపుచు, తోడు నీడయై
ఘనమగు ప్రాణబంధుఁడయి, గాచు ఘనుండె వఁడట్టి కృష్ణుతోఁ
నని మొనరిల్పఁగావలసె! నక్కట! యొక్క మహీశు కారణం
బున నిఁక నెట్లొకోయనుచు బొక్కుచు నుంటిని ధర్మనందనా.

ధర్మ—అయ్యో! తమ్ముడా? ఎంత పని జరిగినది.

ఉ. అంచితరీతిగా మనల నారసి కష్టసుఖంబులందు నక్కఁ
బెంచినవాని, బంధుఁడని పించినవాని, విరోధిరాజి గె
ల్పించినవాని, కీర్తిగనుపింపగఁ జేసినవాని, మేలుగా
వించినవాని, నిట్టులవివేకము చేత్యజియించుటొప్పునే!

అయ్యో! నిన్ను నేగదా! ద్వారకనుండి యుద్ధవుండువచ్చి మనసేమమారసిపోయె. కలలోనైన నెఱమరికలులేక నొక్కటేప్రాణమై యుండిన, మీకిద్దరకు వైరంబు సంభవించునని యనుకొనలేదు. బాల్యంబుననుండియు, శ్రీకృష్ణునికి మాయందరికన్న నీయందెక్కుడను రాగము. అతనిబలము చేత నేగదా యరివీరులగు కౌరవాదులు మనలఁగన్నెత్తి చూడ వెరచు చుందురు. ఎంత తెలివి తక్కువజేసితివి? కారణం బేమో! చెప్పుము.

(చతుర్ధనమహారాజు ప్రవేశించుచున్నాడు.)

చతు—ధర్మరాజాదులారా! నమస్కారము.

ధర్మ—(సంజ్ఞతో) అర్జునా? ఈతండెవ్వడు!

అర్జు—తరళవృత్తము.—

ఇతఁడు కుండినరాజచంద్రుఁడు హీనకీర్తి విశారదుం
డతిప్రతాపధనుండు సద్గుణుఁడంచిత ప్రతిభుండు సం
తతసురేశ్వరపూజనీయుఁడు ధర్మమూర్తి భయార్తిచే
హితము మై శరణంబుజొచ్చిన నేను గాచితి ధర్మజా!

ఈనృపుండు దుఃఖించుచు, మిషబెట్టి మొట్టమొదట కృష్ణుండు వైరియని చెప్పక పాదంబులు విడువక శరణు వేడిన, దూరదృష్టిలేక శరణాగత రక్షణంబు మనకు కర్తవ్యమని గట్టిగా ప్రతిజ్ఞ జేసితి కావున నీచతుర్థుని ప్రాణరక్షణమగు దెరఁగు నాలోచించి నాకీర్తినిలుప మిమ్ముల ప్రార్థించుచున్నాడను. (పాదంబుల పైబడుచున్నాడు.)

చతు—ధర్మరాజా! ఆర్తత్రాణపరాయణా? శరణు. శరణు. (పాదంబులపైబడుచున్నాడు.)

ధర్మ—(ఇద్దరినిలేవనెత్తి) రాజా? భయపడకుము. తమ్ముఁడా! చింతింపకుము. మించినదానికి వగచిన లాభంబులేదు. కాని యతఁడు సురాసురులకైననజేయుఁడు.

మ. సకలాశాంతశుభంకరాయతయశస్సాంద్రుండు, భూలోకనా
యక సంస్తేజశిరస్తటీమకుటదీవ్యద్రత్ననీరాజితాం
ఘ్రికషాయారుణపాదపంకజుఁడు, సర్వేశుండు, వైకుంఠుఁడ
త్యకలంకుండుజనార్దనుండతనిశక్యంబౌనె? యోడింపగాన్

అయినను మనలనమ్మివచ్చిన శరణార్థిని విడచిన లోకాపవాదకు లోనగుదుము. కావున,

క. శరణాగతునికినైసం
గరమునహరిచేతజచ్చికడుకీర్తిని నా
సురపురికరుగుదమరయఁగ
శరణార్థినిగావలేనిజన్మంబేలా!

ఫల్గుణా?

గీ. ఘనతనిల్పఁగనీవుఁజేసినప్రతిజ్ఞ
నిలిపినీవుగాచినధారుణీశుగావ
బ్రతినవట్టితినివిచారపడకుమింక
దైవముండెనాపై ముందుదారిజూప.

(రాజుంజూచి) చతుర్థనా! ఇఁకమనంబున జింతింపకుము. నీప్రాణంబునకు నాప్రాణంబడ్డువైచి నిన్నుజీవితునిగా జేసెదఁగాక?

చతు—చిత్తము. (నమస్కరించుచున్నాడు.)

అర్జు—(విచారించుచు) నిష్కారణంబుగ నాప్తుండగు కృష్ణునితో విరోధంబు దెచ్చితినే.

భీమ—(కోపముతో) అర్జునా! ముందుచేసికొని వెనుక నాడుదానివలె గ్రుడ్డునకుగుంచెడొంచిన లాభంబేమి! కాలవశమున నెట్టిమిత్రులైనను శత్రులగుదురు. అదియునుంగాక పాండవులు శౌర్యహీనులనియును, నావలన బ్రతుకుచున్నారనియును, నేనుచూడకపోయిన వారునిల్వలేరనియు, మనమునందొక గొప్ప గర్వమూని చరించుచున్న కృష్ణునికై యుంకను విచారించెదవేల?

అర్జు—అన్నయ్యా? అట్లనుకొనుచున్నాడా?

భీము—రేయింబవళ్లు నీవేమూనుదిక్కని పొగడుచు, ఇట్టుకొనిప్రాపించుచుండ, నను కొనుట వానిదితప్పా?

అర్జు—(తలపంకించుచు) ఔను.

భీము—(కోపముతో) ఇపుడాగర్వంబడంచుటకు మంచితరుణంబు సంభవించినది. మనము శరణుజొచ్చిన వానినివదలము. అతఁడు యుద్ధంబునకు రాకతప్పడు. తనప్రతిజ్ఞవిడువఁడు. అప్పుడు నిన్నును నీస్నేహంబును విచారింపఁడు. అది మాత్రము తలంచుకొనుము. ఇంక నాకంటెవో మొదటినుండి యాతనిలోము భావకమే. అంతవిరోధములేదు. నీయంత యతిస్నేహంబునులేదు. నీవలెనే ను కృష్ణునికై చింతించుదునే. ఇట్లుచూడుము.

మ. కదనోర్వీస్థలిసర్వయాదవులవీకన్ దాకుచున్ బోరుచున్
గదచేఁగూల్చుచునార్చి, రక్తనదులుగ్రస్ఫూర్తిఘోషింపుచున్
పృథివింబారలయాంతకాకృతిని నర్తింపంగనేశౌరియే
యదునాథుండనినిల్చుకంటికెదురై యాఖండలాత్మోద్భవా.

మ. పటువీర్యంబుసంగరస్థలినిశుంభచ్చౌర్యమేపారను
ద్భటసంక్షోభముపుట్టగాగదనుచేతంబూనిరక్తాక్షునై
చటులోగ్రాకృతిద్రిప్పిగొల్లలనుపంచత్వంబునొందించినే
త్రుటిలోగెల్వనెకృష్ణు? నామగదకుంద్రుప్పంబెనే! తమ్ముఁడా.

నకు—భీమసేనా! నీవునుడివినది నిక్కువము. మనపార్థుండు నిజబలంబు తానై ఉంగక చింతించుచున్నాడు గాని నిజముగా నాతనికజేయమెద్ది?

మ. వరగాండీవధనుర్విముక్తశితజాజ్వల్యప్రభీతావహ
స్ఫురదస్త్రాగ్నులనద్రిశల్బరపుచున్ ముల్లోకముల్బ్రుగ్గిలన్
బరసైన్యాటవిదేవదత్తనినదార్భాటంబుతోనిల్వగాన్
హరికేగాదుపినాకికైననశక్యంబా? నరున్ గెల్వగాన్.

మఱియు భీమాగ్రజా!

మ. గహనంబందునబారుశేల్లగమిజీకాకై పడన్ బట్టిదు
స్సహరోషంబునజేల్చుబెబ్బులిక్రియన్ శస్త్రాస్త్రముల్గుప్పుచున్
అహితబృందమువెంటబర్విడుచుశౌర్యంబొప్పబోకార్చునీ
సహదేవుంగనజక్రికిక్రితరమా! సంగ్రామరంగంబునన్.

సహ—(నవ్వుచు) అన్నయ్యా!

క. వినుధర్మజుభీమ నిఘ
ల్గుణునిన్ నినునన్ను సమరకుంభునియందున్
గనియెఱుఁగఁడె! హరి! కడుబలి
యునితోననియేల! సంధియుత్తమమనఘా.

కృష్ణుండు సాక్షాద్విష్ణుండుగాని కేవలనరమాత్రుఁడుగాఁడు. అందులో నతని చెంత నవతార స్వరూపుండగు నీలాంబరుండును, గదుఁడు, కృతవర్మ, యుద్ధవుఁడు, నక్రూరుఁడు, సాంబుఁడు, ప్రద్యుమ్నుఁడు, వృకుఁడు, నుగ్రసేనుండు, జేకితానుండు, ననిరుద్ధుఁడు, ఋషభుఁడు, జారుదేష్ణుఁడు, సారణుఁడు, సాత్యకి, దీప్తిమంతుడు, బుష్కరుఁడు, భోజుఁడు, బార్ష్ణేయుండాదిగాఁగల మహావీరులు పెక్కండ్రుగలరు. వీరలందరికింజాలువారు కృష్ణబలభద్రులు. బంధువులగు వారికి మనతోసమరంబు కర్జంబుగాదు. జయాపజయంబులు దైవాధీనంబులు. ఎటువచ్చి యెటుపోవునో తెలియదు. కావున భీష్మునితో నాలోచించి, సాధ్యమగునంతవరకు సంధియొనర్చుట యుత్తమము. అంతకును వారు చతుర్థమును గాపాడకున్న చతుర్థోపాయమే కర్తవ్యము.

ధర్మ—సహదేవా! నీబుద్ధిబలంబు చాలమెచ్చవచ్చెడి. నీయూహ సకలసజ్జన సమాదరణము. కావున నీవు చెప్పినచొప్పున మనబాగుగోరునట్టియు, నీతివేదియు, జగదేకవీరుండగు భీష్మాచార్యుని చెంతకరిగి కర్తవ్యమాలోచింతము. ఇప్పుడే సర్వసైన్యంబులను గరిపురంబున కరుగునట్లుత్తరువు సేయుము. తక్కినబలంబులకు ప్రయాణంబు తెలుపుము. గడువుదినంబులు సమీపించుచున్నవి. మనమిప్పుడే బయలుదేరి హస్తినాపురం జేగుదము. మీరందరుబోయి ప్రయాణములగండు.

భీము—చిత్తము.

అర్జు—చిత్తము.

(అందఱునిష్క్రమించుచున్నారు.)



# విచిత్ర భారతము.

తృతీయాంకము - ద్వితీయరంగము.

హస్తినాపురము—కౌరవసభ.

(ధృతరాష్ట్రుఁడు, దుర్యోధనుఁడు, దుశ్శాసనుడు, శకుని, కర్ణుఁడు, ద్రోణుఁడు, కృపుఁడు, అశ్వత్థామ, ప్రవేశించుచున్నారు.)

ధృత—పుత్రా! పాండుకుమారులింతకుముందే కరిపురంబునకువచ్చిరనివింటిని. నిజమేనా!

దుర్యో-జనకా! నాకాసంగతి సుంతయైన దెలియలేదు.

శకుని—మహారాజా! పాండవులిదివరకే వచ్చినట్లును, సప్తాక్షౌహిణీ బలంబులింక నువచ్చుచున్నట్లును, గొలువునకు రాకముందు విదురసంజయాదుల పరస్పరాలాపంబుల వలన దెలియవచ్చినది.

ధృత—ధర్మనందనుడువచ్చిననన్నుఁజూడకుండ దనతల్లియగు కుంతితోమాట్లాడకుండ నిల్చునా! ఎచ్చటబసదిగిరి.

శకుని—కౌరవనాధా! భీష్మునిగృహమున నిలిచినట్లు వినియున్నాము.

దుర్యో-సకల బలంబులతో నిచ్చటికి వచ్చుటకును, సమ్మతిలతోఁగూడి తాము మొట్ట మొదట భీష్మగృహంబున కరుగుటకును, గారణమేమై యుండునోవు.

కర్ణ—(నవ్వుచు) రాజరాజా! ఎంత వెఱ్ఱివాడవు. ఇంకను బెదతోవనే యున్నావు. మహాపౌరుషవంతులగు పార్థులు జ్ఞాతులింటికి వత్తురా! వారువచ్చుటకు గారణంబు వేరేయున్నది.

దుర్యో-మిత్రమా! కారణం బేమి?

కర్ణ—వారిచిరకాల కోర్కెంబుఁ దీర్చకొనుటకు వచ్చుటయేగాక వేరేమున్నది?

దుశ్శా-అంగరాజా! నిజము. నిజము. వారుమొదట పాండవపక్షపాతియగు భీష్మునితో సంగరంబునకు వచ్చితిమనిదెల్పి, యనుజ్ఞవడసి తరువాత మనలదాకుటకే వచ్చిరిగాని వేరు కాదు.

శకుని-దుశ్శాసనుండాలోచించిన తెఱంగు యుక్తాయుక్తముగా నున్నది. లేకున్న వారికాయుద్ధచిహ్నములేల! సైన్యంబులేల? మొన్నటివిదుర రాయభారమునకు ఫలమిది. నేనుచెప్పలేదా?

కృపుడు-(ద్రోణుంజూచి రహస్యముగా) ఆచార్యా! వింటివా? ఈదుష్టచతుష్టయము యొక్క న్యాయవాదంబులు.

ద్రోణు-(రహస్యముగా) కృపాచార్యా! వీరిని మనమెఱుఁగమా? క్రొత్తలా! కర్ణాదులుపన్యసించుటకును, దుర్యోధనాదులు వినుటకును, సరిపోయినది. పోనీదుర్యోధనుండు న్యాయాన్యాయంబులను మంచిచెడ్డలను, విచారింపక పోయిన, నేండ్లుగడచిన ధృతరాష్ట్రునికైన తోచవలదా? వారేమనినను గంగిరెద్దువలె దలయూచనగునా? అందుచేతనే "రాజ్యాంతే నరకంధ్రువ" మ్మనునార్యోక్తి చెప్పఁబడియున్నది. మనమేమనినను, పాండవపక్షపాతులని పంగనామములు దిద్దుదురు. అయినను మనమైన నాలోచింపవలెగాని యెన్నఁడైన పాండవులంత దొంగయుద్ధంబునకు వత్తురా! నీవు, నశ్వత్థామయు, నాదగ్గరనుండగానేకదా, వారివృత్తాంతము సంజయుడింతకుముందునాతో చెప్పెను. ఎప్పుడూయిట్టి మాటలం జెప్పిరే కర్ణుండు! వీరినింతవరకు దెచ్చెను. అయినను మనకెందుకు వారియన్నంబు తినుటంబట్టి వారికిష్టమగు నుత్తరంబులిచ్చుచు గాలంబుగడుపుటయే యుత్తమము.

కర్ణ—(ఇటునటుంజూచుచు) దుశ్శాసనా? చూచితివా! అవిగోయింకను కాల్బంబులు, గుఱ్ఱపుదళంబులు, రథవ్రజంబులు వచ్చుచునేయున్నవి. నామాటలబద్ధమేమో చూడుము. (చూపించుచు) వినుము. అరథకేతనంబు లెట్లుగాలివలన ధ్వనించుచున్నవో? రాజరాజా! కనుఁగొంటివా! ఇంకనూ మనకనిశ్చయంబేల? పార్థుండుక్కుమిగిలి మనపై దురంబున కరుదెంచుచున్నాడు. మనప్రయత్నంబున మనముండుటమేలు?

ధృత—నాయనా! ఎంతయాలోచించినను నిజకారణంబు పొడసూపకున్నది. ద్రోణాచార్యా! పాండవాగమనంబునకు హేతువేమైన మీకుబొడగట్టినదా?

ద్రోణు-కౌరవనాధా! నాకింతదనుకనే తెలిసినదిగాని మమ్ముమీరిదివర కడుగకపోవుటచేతను, దున్నపోతీనిన దూడనుగట్టమను, కర్ణాదివీరుల, దూరాలోచనలును, యసంబద్ధాలాపంబులను వినవలెనని యూరకుంటిమి.

కర్ణ—ఆచార్యా! ఏమి? మాయవిదురాలోచనలా!

ద్రోణు-అంగరాజా! దూరాలోచన లంటినిగాని, దురాలోచనలనలేదే. నీకు జెవుడుపట్టినది కాఁబోలు?

కర్ణ—(కోపముతో) దేహమంతయు దూవిబుంగవలె నెరసికాటికి గాళ్లుజాచుకొని, రేపో నేఁడోయనువృద్ధునకు జెవుడుగాని సంపూర్ణయౌవ్వనుండగు నాకు జెవుడెట్లువచ్చును?

ద్రోణు. ఔనౌను! దుష్టచతుష్ట యాగ్రణీ? యావనభూతంబు సర్వాంగములయం దు బ్రవేశించి, మంచిమాట చెడ్డమాటగను, చెడ్డమాట మంచిమాటగను వినిపింప జేయుచెలుంగక జెవుడనుకొంటిని.

కర్ణు—(కోపముతో) పాండవపక్షపాత బ్రహ్మరాక్షసి మీకావేశించినది గాఁబోలు అందుచేతనే మీచెంత వారిపేరు మేముదలఁచిన వంశిపడిపోయెదరు. పోషించుప్రభువు క్షేమంబుగోరి యిప్పుడే మేల్కొని యుండుటమంచిదని తెల్పితినిగాని మీవలె బెల్లముఁగొట్టిన రాయివలె నూరకొని లోపలిస్వామిపాకము లు సేయలేదు.

గీ. ఔరదుష్టచతుష్టయమనెదుగాని
నీవుభీష్ముఁడుగృపుఁడునునీతనూజు
లరయదుష్టచతుష్టయమగుటదెలసె
సిగ్గులేకనుమమ్ము దూషించెదేల?

కృపు--గీ. తగునె? చిన్నపెద్దతారతమ్యమెఱుంగ
కుండ బ్రెల్లెదోటికుండనీరు
గారునట్లుకర్ణ! గర్వంబుకూడదు
మేదినీశుఁడెంతమిత్రుఁడయిన.

క్షేముసహించువారము కాముసుమా!

కర్ణు—(కోపముతో) పిటికిపందలగు బ్రాహ్మణులే సహింపలేకపోయిన, సకలశస్త్రాస్త్రసారవిద్యాధనుండగు నేను సహింతునా!

అశ్వ—(కోపముతో) ఏమీ! సిగ్గులేక బ్రాహ్మణనింద నొనర్చుటకు నీకు నోరెట్లువచ్చినది? నిన్నింతమహావీరుండనని చెప్పికొనుటకు విద్యనేర్పిన గురుండెవ్వఁడు? మఱియు.

క. మాకును దెలియునునీదగు
ప్రాకటశౌర్యంబు క్షేముపలుక వెరచినన్
లోకముమూయగనీకుక
మూకుడుగలదాకొ! నోరుమూయుముకర్ణా!

కర్ణ——రాజా!

క. మందునిగతినుండకతా
ద్బృందంబులనవ్వఁజేయువీనిమృథాచు
ల్కండనముదురుసుగనుమా
కుంజేటికిక్రొమ్ములొదవె! కువలయనాథా!

అశ్వ——రాజా?

క. నాకనదీసుతగురుకృప
ప్రాకటసద్యశులచెంతపలికిధెఱుంగం
ఢీకుమతివదరఁదొడరెను
గాకిమెకోకిలమునాయె? కౌరవనాథా!

(కర్ణుంజూచి)

ఉ. ఏమిరకర్ణ! నోటిదురుసేటికి? క్రొవ్వునగాదె! లేకసీ
సామజపట్టణాధిపుఁడు సంతసమందిపరాల్గురాలుము
క్తామణిభర్మభూములతికాంతివినిర్మలసౌధరాజులీ
నామిడునంచుపేరెదవ! నైజము! యావ్వనభూతజాడ్యమా!

కర్ణ——(కోపముతో)

ఉ. క్రొవ్వుటచేతనే వెడగుగూతలుకూయుట, పప్పుకూటిచే
గ్రొవ్వుటచేతనే; యిటులగొంకకప్రేలుటకాలుదువ్వుటల్
క్రొవ్వుటచేతనే; తమదెఱుంగకనన్యులదూలనాడుటల్
క్రొవ్వుటచేతనే; పరులుక్రొవ్వినగవ్వకుసాటివత్తువే.

అశ్వ——(నవ్వుచు) ఎన్నఁడూవినరాని సంగతులు,

చ. కురుగృహమందునెంగిళులుగుడ్చుచునాతనిమోముప్రీతిగా
నరచుచుగయ్యమన్నభయమందుచు, గంతులువైచుకర్ణకు
త్కారమునకెప్డుపౌరుషము! రోషము! శౌర్యము! గన్లెప్పుడీ
వరకునులేదుకర్ణుఁడ! శబాసిది! యెంగిలికూటిసత్తువే?

కర్ణు—(కోపముతో బాణము వేయబోవుచు.)

ఉ. ద్రోణజ! నిన్నుమచ్చరముఁద్రుంచుట యెంతదె? కాచికొమ్ము నీ
హైనపటుత్వముం బలము ధైర్యము శౌర్యము వీటిబుచ్చకన్.

అశ్వ—(కోపముతో కత్తిదీసికొని)

"మానముదూలనీస్వకుచమర్దనమేటికి నిండుకొల్వులో
న్యూనతగాదె? డంబమిటనొప్పునె? శౌర్యగల్గచూపుమా.

(నఱుకబోవుచు) ఓరీ! మూర్ఖా? నీవా నన్నుద్రుంచువాడవు?

కర్ణ—(తన్నబోవుచున్నాడు.)

దుర్యో-(విడిపించుచు) కర్ణా! శాంతింపుము. గురుపుత్రా? శాంతింపుము. నిష్కారణంబుగ గయ్యంబునకు గాలుద్రువ్వనేటికి? ద్రోణాదులారా! బాల్యంబున కర్ణుండేమైన ననిన మీరంతయలుగఁదగునే!

కృపు—(రోషములో) రాజా! చాలుచాలు. నీచనువుచేతనే పిన్నపెద్దల తారతమ్యంబు నెంచక నీతనికింత కంఠశావరము హెచ్చినది. ఇంతకునేమున్నది? కృష్ణుండు తానుజంప ప్రతిజ్ఞపట్టిన నృపుని పార్థుండు గాతునని ప్రతిజ్ఞబట్టినందునను ధర్మరాజాదులు యింద్రప్రస్తంబుననుండి యిచ్చటికిచనుదెంచుచున్నారని చెప్పటకుదొడరినగదా! ఇతఁడునడ్లెరుపై బండివలెమామీదికిలేచెను.

ఉ. సూతునికింతపౌరుషము చొప్పడమేమొకొ! తీసిపోదుమో
భూతలనాథ! గర్వమున బొంగెడువీనికిబుద్ధిచెప్పుమా

కర్ణ—(కోపముతో)

"నీతలదాటువారలననేకులజూచితి, గారులార్వకన్
బాతక! బుద్ధిదెచ్చుకొనివత్తిలుమీ! గరువంబువీడుచున్.

కృపు—(కోపములోలేచి) ఏమీ!

ద్రోణు-(కృపునింబట్టికొని)

క. మాటకుమాటే తెగులగు
నీటికరయనాచు తెగులునీవాతనితో
మాటలు శెలవిడకుమునా
మాటనువినుమూరకుండుమా! కృపయుంకన్.

ధృత—నాయనా! ద్రోణాదివీరులెప్పుడును కర్ణునినోటి మాటరాకుండగనే యొత్తిచీమలవలె పట్టుకొందురు. చిన్నతనంబున నొకవేళ నేదియైన దప్పి జారియనిన చోవాని ప్రాణంబులు దీయనెంతురు. వీనికిని వీరికినింత బద్ధవైరమునకు గారణంబేమి? మును పెన్నఁడు నింత ఘోరంబులేదే.

అశ్వ—(కోపముతో లేచి) కౌరవనాథా! మాటిమాటికి జివ్వకుగాలుద్రువ్వు నీసూతకుల పాంసనుండు మంచివాఁడా? మేము చెడ్డవారమా! ఏమితీర్పు దిద్దితివి. ఇటువంటి న్యాయాన్యాయంబులు నిటువంటి పక్షపాతమునుంగల రాజుంగొల్చుటకంటె.

గీ. బండమెడగట్టినూతిలోఁబడుట మేలు
దున్నలంగట్టిపొలములదున్న మేలు
బ్రహ్మద్విజులకు చెప్పినప్రథమవిద్య
చెంబుదోముచునిల్లిల్లుచేర మేలు.

(ద్రోణకృపులంజూచి)

ఉ. మానితరీతిదూలియభిమానముజూపనిరాజుగొల్చినన్
న్యూనతగౌరవంబడగునొప్ప మిగల్గునుగాననింకదం
(యిద్దరినిలేవదీయుచు.)
డ్రీ! నడు, లెమ్ముమాతుల? ధరిత్రినిరాజులులేరొ కొల్వ! మా
మా? నడు, లెమ్ముతండ్రి, యభిమానము లేదొకొ! వించునుండియున్

(లాగికొనిపోవుచున్నాడు. ద్రోణ కృపులు నిష్క్రమించుచున్నారు.)

(ధర్మరాజ, భీమార్జున, నకుల, సహదేవ చతుర్ధనులు ప్రవేశించుచున్నారు.)

ధృత—ఎవ్వరు?

ధర్మ—జనకా! నమస్కారము. ధర్మనందనుఁడ. తమ్ములతోఁగూడి చతుర్ధనుండను, శరణాగతునివెంట బెట్టుకొని తమదర్శనార్థంబరుగు దెంచినాడ!

ధృత—ధర్మజా! చతుర్ధనుండెవఁడు? నీవువచ్చుటకు గతంబెయ్యది!

ధర్మ—తండ్రీ! ఇతఁడు కుండిన పురాధీశ్వరుండగు చతుర్ధనుఁడు. పూర్వకర్మవలన తుల్యశాపతప్తుంబైన రంభగుఱ్ఱమైయుండ నీతండు దానినధిష్టించి త్రిలోకసంచారంబొనరించి వచ్చుచుండ యమునానదిలో హరికి తర్పణంబిడు కృష్ణునిజలాంజలియందా మాయాశ్వఫేనంబు పడనాతండలింగి, యీతనినెలలో జం

పుదునని ప్రతిజ్ఞఁబట్టి భీతినొంది, యర్జునుని శరణుజొచ్చిన నాతండీతనిఁ గావ బ్రతిజ్ఞఁబట్టెగావున నాతని ప్రతిజ్ఞతోఁగూడ నీనృపునిగావ మిమ్ముప్రా ర్థింపవచ్చితిఁ. భీష్ముండుఁగూడ నీతనిగావ బ్రతినవహించి యున్నాడు. (చిం తించుచున్నాడు.)

ధృత—అజాతశత్రువా! నీవుతలంచిన పనికేల విఘ్నంబుగలుగును. ఈనృపుని నేస తప్పకగాచెదగాక?

శకుని—(దుర్యోధనునిచెవిలో) మనకు హానినోర్చుటకు మంచిసమయంబు చేకూరినది.

దుశ్శా-(కర్ణుని చెవిలో) ఇప్పుడు వీరితోఁగలసి కృష్ణుని బరిమార్చిన తరువాత వీరిని ఁ యుంచుటకు సావకాశము గల్గునుసుమా!

కర్ణ—(దుర్యోధనునిచెవిలో) వీరికి సహాయంబొనర్చి హరినింజయించి పిదప సంగ తి నాలోచింతము.

శకుని—ధర్మరాజా! చింతించెదవేల?

ఆ. వె. కోలచేతబూనినాలమందలగాచు
గొల్లబోయకొఱకుగుందనేల!
పార్థప్రతినదీర్చివసుమతీశునిగాచు
టెంత? కృష్ణుగెలుచుటెంతమనకు!

తల్లిబుట్టిల్లు మేనమామెఱుఁగఁడా! యన్నట్లుయీతనిసంగతి నెవ్వారెఱుం గరు?

కర్ణ-ఉ. అర్జునుడంతవాఁడుకడునాదరణంబుగగావబూనినా
నిర్జరనాథుఁడైనధరణీశ్వరుమోమును దేరిచూడఁగా
నర్జముగాదనంగయదుకాంతునిజెప్పగనేల? విక్రమ
స్ఫూర్జితశక్తిపౌరుషముజూడమె! మొన్నటిదాక! ధర్మజా!

దుర్యో-క. అవనీనాయకచింతిల
నవసరమేముండె! యదుకులాధిపుకడిమిన్
బవరంబుననోర్చిబుధ
స్తవనీయుగిరీటిప్రతినజరుపుదుమనఘా.

సీ. పరశురామునితోడఁ బరఁగమందు జయమొంది
   పేరుఁబొందినయట్టి భీష్ముఁడుండె
నఖిలాస్త్రశాస్త్రవిద్యలకాదిపీఠమై
   దుర్జయుండగు నట్టి ద్రోణుఁడుండె
ముల్లోకములనొక్క ఘుమ్మున నస్త్రవహ్నిని
   ముంపఁజాలిన ద్రోణపుత్త్రుఁడుండె
సహజకుండలకవచాభిరాముఁడు జామ
   దగ్న్యశిష్యుఁడు సూర్యతనయుఁడుండె.

గీ. శకుని, సౌబల, కృపులతిశౌర్యధనులు
చూపిననుముట్టుకొనిపోవు శూరులరయఁ
గలరుమనచెంతలోకముల్ గలఁచువారు
తలకనేఁటికి మనమునధర్మపుత్ర!

దుశ్శా — అగ్రజా?

చ. ఘనులగు సర్వభూపతులఁ గన్న సేనలతోడఁ గూడిర
మ్మనమని వారి దోడ్కొ నిరయంబున ద్వారకజుట్టుముట్టి యా
వనజదళాక్షుఁబట్టియనిభంగము సల్పిజయించి యంతటం
ధ్వనుని భయంబువాపుదము ధర్మజువాక్యము రిత్తపుచ్చకన్.

దుర్యో — తమ్ముఁడా! మంచిది. ఇప్పుడే వారలందరికి లేఖలబంపుము. (ఆలోచించుచు తమ్ముని చెవిలో) నిష్కారణంబుగ గర్ణునిచే ద్రోణాదుల కలుకఁ బుట్టించితిమి. వారులేకున్న మనము కృష్ణుని గెలుచుటెట్లు? మనమనోరథంబు లీడేరుటెట్లు? కావున ముందుగా నీవును, శకునియు, ద్రోణాదుల చెంతకరిగి నామాటగా నిట్లని మనవిచేయుము.

సీ. ఎన్నఁడాడియెటుంగఁ డిటుఁ రాజు లేచిన
   దుర్మహా ర్తమటంచు ద్రోణుననుమ
అలుకమిమ్ములనన్న పలుకులెల్ల శమించి
   కృపయుంచి రమ్మంచుఁ గృపునికనుమ

ఇననూనుపలుకులగనలినదాౢ్రిణీని
ప్రతిమాలితినియపరాధమనుమ
నవ్వులన్నియునేమువువ్వులాయెనటంచు
జింత్రించెరాజంచు జేరియనుమ.

గీ. తప్పులున్ననుక్షమియింపదగుదురనుమ
గుడిసెలోపోరుపుట్టుటకూడదనుమ.
పరగిమనమిట్లుకలహింపవైరివరులు
నవ్వుదురటన్నరుమశరణార్థిననుమ.

(దుశ్శాసన, శకునులిద్దఱు నిష్క్రమించుచున్నారు.)

(అక్రూరుఁడు ప్రవేశించుచున్నాడు. అందఱులేచుచున్నారు.)

అక్రూ-(అంధుని కౌగలించుకొని) కౌరవనాథా! ధృతరాష్ట్రరాజకులావతంసా? శ్రీకృష్ణునిమామనగు నక్రూరుండ నిదే నమస్కరించుచున్నాడను.

ధృత—శుభమగుగాత! నాయనా? అక్రూరా? సేమమా!

అక్రూ-కురుకులవర్ధనా! మీయక్షీణకటాక్ష వీక్షణంబుల సుఖినైయుంటిని. దుర్యోధనాదులారా? పాండవులారా! క్షేమమేకదా?

దుర్యో-తమదయవలన నిట్లున్నారము.

ధర్మ—అక్రూరా! మీప్రసాదంబున నింతవరకు సుఖంబుగానుంటిమి.

అక్రూ-ఆహా! కౌరవపాండవుల నొక్కచోట జూడగల్గిన నేటిదినంబెంత సువినము

ధర్మ—అక్రూరా!

క. హరిహలధరులకు సేమమె?
పరమపతివ్రతలుసత్యభామాదులకం
దరికినికకుశుభమేకద
హరిబంధులకాత్మజులకుహర్షమె? చెప్పుమా.

అక్రూ-ధర్మనందనా! అందఱుసుఖులైయున్నారు.

ధర్మ--గీ. అనఘ! కృష్ణునినెడబాయకనవరతము
సేవజేయుచునుందువుచెంతజేరి
నిఖిలవంద్యుండుకృష్ణుండునెయ్యమునను
మమ్ముదలఁచునె? మది, చెప్పుమా! మహాత్మ.

ఆహూ్రి -ధర్మసంభవా!

గీ. ఎప్పుడైననుమీామాటచెప్పుచుండు
నహరహంబునుమీావార్తలడుగుచుండు
రేబవళ్లనుమిమ్మేస్మరించుచుండు
తలఁపవారికిమీాకుభేదంబుగలదె!

ధర్మ—(తలయూచి) చాలు సంతసంబయ్యెడి! మహాత్మా? భవదాగమనంబునకుగ తంబెద్ది?

ఆహూ్రి -కుంతీసుతాగ్రజా! చల్లకువచ్చి ముంతదాచుటేల? చెప్పెదవినుఁడు.

గీ. భువినితిలతండులన్యాయముననుమీారు
కౌరవులువైరములుదక్కఁగలయుటకును
వాహినులతోడనిటకీవువచ్చుటయును
యెఱిగిమదిలోనముదమందికృష్ణుఁడపుడు.

నన్నుంబిలువంబంచి యిట్లనియె.

ఉ. కారణమేమి! పాండవులుగారవులుంగలయంగ! నెందుకై
చేరిరొ? వారిజాడలనుశీఘ్రముగాగనిభీష్మపార్థులన్
గూరిమితోడఁజూచిమనకుందగురీతినిబల్కియాసమా
చారమువారినేయడిగిసత్వరరమ్మనిపంపెధర్మజా!

దుర్యో-సందేశహరా! మీరుకారణంబు జెప్పుటకు శంకించు చున్నారుగాన, నేనుచె ప్పెదవినుము. మీకృష్ణుడు నిష్కారణంబుగాఁ జంపఁబ్రతిజ్ఞఁబట్టిన యీాచకు ర్థనుని కృష్ణుండీతని వైరియని యెఱుఁగక గాపాడుదునని ప్రతిజ్ఞఁబట్టె. అం దువలనశరణార్థి రక్షణకై సర్వసేనాసమేతులమై యిచ్చటకూడినాము. కావున,

ఉ. ఇంచుకయైనధర్మపథమెంచకమీాయదుపుంగవుండుగా
వించినఘోరమాప్రతిన వీడిన్నపాలునిగావబూనినన్
మంచిది, లేనిచోతనసమగ్రబలంబును మాబలంబుతో
గాంచకనుండునోకొ! యిఁకకయ్యమునందునజూడుమక్రూరా.

మ. ఘనుఁడౌ చాపగురుండు శాంతనవుఁడుం గర్ణుండు భీమార్జునుల్
వినుతద్రోణిహిడింబధర్మజులుపృథ్వీనాథులుం బోరని
ల్వను దేవేంద్రుఁడొ? యంబుజాసనుఁడొ? లీలం గొల్లయిల్లాండ్రతో
జనుటో? యావులగాచుచుం దిరుగుటో? సంగ్రామమక్రూరకా.

అక్రూ—(కోపముతో) ఏమినీగర్వితోక్తులు? రాజరాజా!

ఉ. కన్నులుగానకుండనధికంబగురాజ్యమదంబుచేతనీ
వెన్నగదూలనాడితివి, తెంపుగగృష్ణుఁడుకన్నువిచ్చిక
న్గొన్ననునీవుదక్కెదవె? ఘోరరణంబుననిల్వనేర్తువే
పన్నగసింహముంగదిసిపైబడగోరుదె? మిన్నకుండుమా.

మ. ఘనతేజోనిధిదుష్టశాత్రవకనత్కాంతారదావాగ్నియై
జననంబందినయజ్ఞపూరుషుఁడు, కంసారాతి, కృష్ణుండుపూ
నినశబ్దంబునుమాన్పజాలఁడనవాణీప్రాణనాథుండు, నీ
వనగానెంత? ప్రతిజ్ఞమాన్పదరమా! యౌదార్యదుర్యోధనా.

మ. దివిజారాతులద్రుంచి, పుష్పమునకై దేవేంద్రుతోఁగూడనా
దివిజవ్రాతముబారదోలియశమున్ దిగ్వీధులంగప్పిశౌ
ర్యవిలాసంబులనొప్పుచక్రధరుతో వైరంబుసాధించిగె
ల్తువొకో? కర్ణుఁడుబోధజేసెనొకో; యీదుర్బుద్ధి? దుర్యోధనా!

సీ. సురలనుబాధించునరకాదిదైత్యుల
జెండెనాలమునగృష్ణుండు కాదె?
బలితనయునితోడబ్రమదాధిపునినని
సుక్కణంచెనతఁడుకృష్ణుండు కాదె
శౌర్యోన్నతునిజరాసంధునాజినిదోల
సురలెల్లబొగడగృష్ణుండు కాదె
ధారుణిసప్రతివీరుఁడౌ చాణూరు
సురపురికనిచెగృష్ణుండు కాదె.

గీ. పదములను గాళియభుజంగమదమడంచె
కువలయాపీడమును నేస్తునవనిఁగూల్చె
దండిమగఁడైన బాలకృష్ణుండు కాడె
యష్టగలనొకో? హరికి బ్రహ్మాండమ్మందు.

గీ. అట్టి శ్రీహరితోడ నాహవము సేయు
దలఁపుఁగల్గిన నేనింక దెలుపనేల
బంధుపోకడ, చింతయు, బరిభవంబు
కులవినాశంబు దప్పక కలుగునధిప.

కావున సాక్షాద్విష్ణుండగు కృష్ణుని గెలుతుమన్న పిచ్చియూహఁ గట్టిపెట్టి యిఁగా చక్రధరుని విడచి యాతని శరణంబు వేడుడు.

దుర్యో-(కోపముతో) అకూరా!

ఉ. శౌరిపరాక్రవంతుఁడె? నిజంబుగ నాజరసంధుపోరిలో
బారడె! భీతితో యవను బారికి దప్పి గుహాళి డాగడే
సా రెకు మేమెఱుంగమని సంస్తుతిజేతువు వందిభంగిన
కూరక! చాలు చాలు నిక గొప్పలు జెప్పకు మెప్పు నిచ్చుటల్.

కర్ణు—(నవ్వుచు) అకూరా! నీవచోపారిగల్భ్యత చాల మెచ్చవచ్చెడి. కృష్ణుని కొల్వులో భట్రాజువలె నీకు వర్ణనపనియే కాఁబోలును. నీవిప్పుడు చెప్పిన కృష్ణచర్యల మానుషంబులయి నీకు గొప్పగనున్నవి కాని మావంటివారు వినుటకు దగినవి కావు.

సీ. ఆలమందలు కావు కోలచే బెదరించి
చల్లుపప్పుని తోల ఘట్టివాడ
తొట్టులం గాఁచెడి ఘట్టి గొల్లలు కారు
చేతులు జోడించి చెంత నిలువ
వెన్నముద్దలు కావు పిడికిళ్లలో నుండి
జారగా నాకినోరూర జుట్టు
వెదురుగొట్టాల్గావు పెదిమిపై మోపితం
దనపదాలాడంగ వనములందు.

సీ. విమలశృంగారులు, వైరులు, స్త్రీముఖలమంట
లరిది పెన్గదలకూరిరి? దురమనంగ
నలరుబృందావనంబుననల్లిబిల్లి
గొల్లయిల్లాండ్రసరసంపుగోలకాదు.

చ. ఇరవుగరక్తమాంసమదమెండిక్కృశించినబక్కయేనుగన్
దరుగుటశౌర్యమా! నృపులునవ్వగనొక్కటమద్దిచెట్లుల
విరచుటశౌర్యమా? ముదిమిపెంపునగోఱలులేనిపాముపై
బొరలుటశౌర్యమా! మిసిమిముద్దలుదొంగిలశౌర్యమా! సఖా.

లోకంబునదమ్ము పోషించు ప్రభువులస్తుతించు న్యాయంబున నిట్టింటివిగాని నీకమాత్రమాతని పౌరుషము తెలియదా?

అక్రూ--(కోపముతో) కర్ణా! అసంబద్ధప్రలాపీ!

చ. గురుతరమైననాజిశరకోటిని దేహమురక్తవర్షముల్
గురిసెడునాడు, సారథియు, గుఱ్ఱముదేరునుగుండపిండిగా
ధరపడునాడు, పర్విడుచుదండడిజెందెడునాడు, చక్రముల్
బరచిననాడు, దైత్యరిపుపౌరుషమెంతువుకొండ రేలికిన్.

గీ. పాంచజన్యంపుమ్రోతయు, బటుసుదర్శ
నంపుమంటలుసెలంగ; నందకపుతళత
ళలుకనులకెల్లమిరుమిట్లుగొలుపశార్ఙ్గ
రవమువీతేరదెలియుమాధవునిబలము.

సహస్రదేవేంద్రులైనను, సహస్రమహేశులైనను, సహస్రాజిత్యులైనను, రణంబునదేరి చూడలేని యమ్మహాత్ముని మహత్వంబెఱుంగక నిట్లుప్రల్లదంబులు పలుకంజొచ్చిరి. మీక్షేమంబుకోరి కృష్ణునితో వైరంబుదక్కి శరణంబు నొందుటమేలని హితోపదేశంబు జేసితింగాని, మీసంగతినాకేల! మీతోడ నాకీవితండవాదమేల? (ధర్మజుంజూచి) ధర్మనందనా! మీవచనంబులు బాగుగాలేవు, కౌరవులనమ్మి నిష్కారణంబుగ జెడసెంచితిరి. దూరమాలోచింపుడు.

ఉ. వైరముదక్కి ప్రేమగలవారివలె౯ నటియించి, మీకుగం
సారికిబద్ధవైరముగసల్పియనంతరమందునా ర్తిచే
కూరిచిభంగపెట్టుటకుగూడిరికానియదార్థమెంచగా
వీరికిమీకుజూపులును బ్రేమలుగల్గెనె! యింతకాలముక౯.

నాకీమాటకు జవాబిమ్ము.

ఉ. మన్ననజూపుచెప్పుడభిమానతగష్టసుఖంబులెంచుచు౯
బిన్నతనంబునుండిమిము బెంచినగృష్ణునిపొందుమంచిదో
పన్నగపైకినప్పుచునుబల్కుచుగుత్తుకబంటిగావిషం
బున్నసుయోధనాధమపయోముఖకుంభముపొందుమంచిదో.

చివరకెంతవాఁడవైతివి? ఎంతకృతఘ్నుఁడవైతివి!

క. గురుఁడై, బంధువుఁడై, సో
దరుఁడై, రక్షించునట్టిదైవంబై, మి
మ్మరసినశ్రీకృష్ణునిముఖ
సరసీరుహమెట్లుచూడజాలుదువనిలో౯.

(అర్జునుంజూచి) అర్జునా?

చ. కలకుదనంబుమానిమదిగారవప్రజ్ఞలనమ్మబోకనా
హరిశరణంబువేడుమురయంబున, నద్దియె మేలు లేనిచో
మఱఁదివటంచునీచనువుమాటలు, సోదరిదుఃఖమెంచడా
సరసిజనాభుడాలమునజక్కగదూరమునూహసేయుమా!

సీ. పాంచజన్యరవంబుబయలువడకమున్న
ఘనసుదర్శనము జేకొనకమున్న
కౌమోదకీప్రీతిగలుఁగ జేయకమున్న
గన్నులురక్తిమఁగనకమున్న
కౌస్తుభంబురముపై గదలియాడకమున్న
బిడికిటనందకంబిడకమున్న
శార్ఙ్గమౌర్వీధ్వనిసంచరింపకమున్న
బంధువుల్ రణభూమిబడకమున్న

గీ. శైబ్య సుగ్రీవమేఘ పుష్పకవలాహ
కములు పరువులె త్తకమున్న గరుడ బాధ
బడకమున్న నారాయణుపాలబడుడు
చేయిజారిన నేమియుజేయ లేము.

అర్జ—అహూ్రిరా! సర్వధర్మంబులెఱింగిన నీవేయిట్లుపలికిన నేనేమనగలను? గృహీతపరిత్యాగంబు నేయుట వీరలక్షణముకాదుగదా! సర్వశక్తుండును, సర్వలోక పూజితుండును, సాక్షాద్విష్ణుండునగుకృష్ణుండేమిచేసిన జేయుగాక! సహజశాత్రవులని నీవునుడివిన కౌరవాదుల నంతరమేమి చేసిన చేయునిమ్ము. అన్నింటికిని సర్వసిద్ధుండనై యుండుటం బట్టియే నాకీశరణార్థి దాపరించెను. రోటఁతలదూర్చి రోకఁటిపోటునకు వెరవనేల!

అహూ్రి-(కోపముతో) ప్రాణబంధుండును, ప్రాణస్నేహితుండునై, పొలుచు కృష్ణునితో కక్షసాధింప నెంచితివా? ఈనృపకీట కంబగు చతుర్థునని విడచిపెట్టవా! అన్నింటికిని సర్వసిద్ధుఁడవై యుంటివా! అర్జునా! ఎంతకృతఘ్నుఁడవైతివి? ఎంతద్రోహివైతివి? నీవేయనుభవింపగలవు. ధృతరాష్ట్రాదికురుజనంబులారా! ధర్మరాజా! నేనుచెప్పవలసినదేమియులేవు. నేనుపోయివచ్చెద.

ధర్మ—(విచారముతో) నిన్నుమరల జూచుభాగ్యంబాదవునో! లేదోకదా?

అహూ్రి-(కోపముతో) మిమ్ముమరల జూడనెంచి, మాయందు గృతజ్ఞత గలవారైన, మీరిట్టిచెయిదంబులకేల నొడిగట్టెదరు? చంకదుడ్డుశరణార్థి యన్నట్లుచెప్పి, యెట్టతేలువలె చేయవలసిన వన్నియుంజేసి చివరకు బీదార్పులార్చెదవు. నెయ్యంబునగాదుగాని కయ్యంబున మిమ్ముజూచెదవు. చెప్పవలసిన వుండినచెప్పుము.

ధర్మ—(దుఃఖించుచు) అహూ్రిరా! నీవుద్వారకాపురి కరిగినప్పుడు కృష్ణునితో నయముయుంచి నామాటగానిట్లు మనవిజేయుము.

సీ. వనజాక్షనిన్నన్నవసు దేవునకుగూర్మి
చెల్లెలుకుంతిమాతల్లియనుమ
భావింపబాండవుల్బావమరందులు
పైవారుగారునీభక్తులనుమ

యెన్నఁడునీయాజ్ఞకెదురాడెఱుంగరు
కరుణతో నీతప్పగాయుమనుము
యీరాజునకుమమ్మనిబ్బందిబెట్టిన
నరపతుల్దేవతుల్న గుదురనుము.
గీ. దయనుచూపంగనీకిదే తరుణమనుము
యెంచఁగాదిక్కు నీవె మన్నించుమనుము
కలనుదలఁపనికలహంబు కలిగెననుము
కుంతికానుపునిర్భాగ్యవంతులనుము.

భీము—అక్రూరా!

చ. చిరతరకీర్తిధర్మజుఁడు చింతిలి డీనతనిట్లు బల్కనిన్
వెరచియుగాదు బాంధవము వీడునటంచునుగాని, క్రీడిసం
గరమునఁ గాచినట్టిజనకాంతుని ముట్టఁగ శూలి వచ్చినన్
పరగున ద్రుంతునంచు సభ చాటుము వీరు తెఱుంగ నక్రూరా.

ఈచతుర్థసునింగాచిన నన్నియుజక్కనగు ననుము. లేకున్న.

చ. ఎఱుఁగుడుగా, సురాసురుల కెల్ల నజేయుని నింద్రసూతి, ము
న్నెఱుఁగుదుగాదె? సర్వరిపుబృందము జీల్చెడినన్ను భీము, న
వెఱుఁగుదుగాదె? నాబలము నేర్తెర, నీరణకౌశలంబు నే,
నెఱుఁగుదునంచు పల్కుమెద యించుకసంశయముంచకుండగాన్.

అర్జు—(దుఃఖించుచు) అక్రూరా! కృష్ణునితో నామాటగా నిట్లనుము.

సీ. నెనరువాఁడనుచున్నతనమామ దియొకకంచ
మందున దినిసమరందిననుము
యకట! బాల్యంబాదినలరినమన నెయ్య
మడవి వెన్నెలసేయుబుడుగుమనుము
యింతవానిగ జేసియిపుడు కక్షవహింప
బెంచినచిల్కను ద్రుంచుటనుము
గారాబుతోఁ బుట్టుకంటను తడివెట్ట
నింటికినశుభమంచెంచుమనుము.

గీ. స్వల్పకార్యంబునకుబట్టుపట్టకనుమ
నాదుసత్కీర్తిదుష్కీర్తినీదెయనుమ
కుంతికినిగర్భశోకంబుగూర్పకనుమ
ఘనతనీచతుర్ధనుగావమనుమ, జనుమ!

అతనికింకను గరుణారసంబు గల్గకున్నచో. (కోపములో)

చ. కలహమునన్ గపిధ్వజముగ్రాలఁగ గాండివమెక్కుపెట్టినన్
గెలుచుటయొండె? రంభకవుగింటనుసొక్కగనీదుచేతిలో
బొలియుటయొండె? గానియింకమూఁడవమార్గములేదు, నేనని
శ్చలమతిగాతునన్ననృపచంద్రునిపీడనటంచుదెల్పుమా!

ధృత—అక్రూరా! శ్రీకృష్ణుని కొల్వనకొక బుద్ధిమంతుని దూతగా బంపెదమని యు, సంగతియంతయు దెలియగలదనియుఁ జెప్పుము.

అక్రూ-మంచిది. నేనుపోయివచ్చెద. (నిష్క్రమించుచున్నాడు.)

ధృత—ఆహా? ధర్మనందనా! వింటివా? అక్రూరునిమాటలు. సూర్యరుద్రబ్రహ్మలు, వేయిశక్రులైనను, శ్రీకృష్ణుని గెల్వలేరని నొక్కిచెప్పిన పల్కులు నిజమేకాని యతిశయోక్తిగాదు. కావున నామహానుభావునికినుక నడంపనొక్క మహా వినయ వివేక శాంతగాంభీర్య కార్య ధురంధర గృహస్థాతుండు నతిచ తురుండునగు నొక్కదూత నాతనిపాలికంపిన సమస్తంబు చక్కఁబడుననితో చెడి. కావున మనసభయందంత బుద్ధిమంతుండెవరుకలరు? (ఆలోచించి) ఊ య్యలలోబిడ్డనుంచుకొని యూరెల్లదిరిగినట్లు నీతివేదియు, ధైర్యసురాచలుం డును, బుద్ధిలో బృహస్పతినిం మించువాడును, సద్గుణాకరుండునగు మనస హదేవుఁడుండ నాలోచింపనేల! కావున నీతనింబంపుదము.

ధర్మ—(సహదేవుంజూచి) తమ్ముఁడా! సహదేవా! బహుబుద్ధిమంతుండవనినిన్ను రాయబారిగా నంపనుంకించితిమిగాన నీవిపుడు శ్రీకృష్ణునిచెంతకఱిగి, నేర్పు మీరమాట్లాడి, వినయప్రార్థన పూర్వకముగా సంగతినంతయు, జెప్పినామా టలను, వృకోదరార్జునులపల్కులును, మనస్సునకుబట్టునట్లుగా బోధజేసిబంధు వులగు మనకు నిష్కారణ వైరంబు కూడదనియు, జతుర్ధనుని గాపాడుమ ని

యు, ప్రార్థించి, రాచకార్యంబు సానుకూలంబు జేసికొనిరమ్ము. యాదవులు కుపితులై యేమన్నను, దొందరపడక, ప్రతివచనంబు లిచ్చుచు దూతకృత్యంబు నిర్వర్తించు కొనిరమ్ము.

సహ—అగ్రజా! ఏమినీవెఱ్ఱి? కృష్ణుండు తానుపట్టినప్రతిజ్ఞ మానఁడని యక్రూరుని వల్లనే తేటతెల్లమైన, నింకసంధి పొసఁగునా! అయినను, నానేర్పుకొలంది ప్రయత్నించి చూచెద. నాకుశెలవిండు.

ధృత—నాయనా! నీకుజయమగుఁగాత! పోయిరమ్ము.

సహ—(నిష్క్రమించుచున్నాఁడు.)

ధృత—హరి చతుర్దశుని జంపుదునని ప్రతిజ్ఞజేసిన దివసంబులు దరిసినవి. మనము సర్వసిద్ధులమై యుండవలయును.

దుర్యో—జనకా! ఇదివరకే మనతొమ్మిది యక్షౌహిణుల సైన్యము సిద్ధముగానున్నది.

ధృత—మంచిది, సుయోధనా! ఈచతుర్దశుని పోతుటీగనైన జొరరాని హర్మ్యంబుననుంచి, రేయింబవళ్లు ఘోరాయుంచుము. పాండవులకు దగిన సౌధంబులు విడిది కల్పింపుము. సహదేవుండు వచ్చినతరువాత తక్కినసంగతి నాలోచింతము. నేటికి గొల్వుచాలింతము.

దుర్యో—మంచిది.

(నిష్క్రమించుచున్నారు.)

తృతీయాంకము సమాప్తము.



శ్రీగురుభ్యోన్నమః.

# విచిత్ర భారతము.



## చతుర్థాంకము - ప్రథమరంగము.

### ద్వారక — శ్రీకృష్ణునిసభ.

(శ్రీకృష్ణుఁడు; బలరాముఁడు; సాత్యకి; ప్రద్యుమ్నుఁడు ప్రవేశించుచున్నారు.)

శ్రీకృ—అగ్రజా! బలభద్రా! కౌరవసభకు పంపిన యక్రూరుడింకను రాలేదా!

బలరా-తమ్ముఁడా! ఇంకనువచ్చినట్టు తోఁచదు.

కృష్ణు—ఇంతకాలంబచ్చట దడయుటకు గారణంబేమి?

ఉ. పుట్టినదాదివైరములబొక్కుచురాజ్యధనాభిషార్థమై
యిట్టులకుక్కలట్లుకలహించెడిపాండవకౌరవాదులి
ప్పట్టునసేకమైనపనిభావముదోఁచదికెట్టిచిట్టులుల్
జెట్టలుబుట్టునో! యదురజెందెనువామభుజంబుసోదరా!

బలరా-శ్రీకృష్ణా! ధృతరాష్ట్రునిమీఁదికి సర్పవైరితో సాధృతరాష్ట్రుండే యెత్తివచ్చెనో? ఆరాజరాజుపైకి యతులతోఁగూఁడి యీరాజరాజేద్ధురంబున కరుఁదెంచెనో; ఆధనంజయుని గెలువ నాధనంజయుండే వచ్చెనో, లేకున్న యిట్టివింతలు పుట్టునా? నాకును దోఁచకున్నయది.

సాత్య-బలభద్రా? అట్లయైన గద్దుగూర్చు బంధులగు పాండవులు మనకు దెలియఁజేయకుందురా!

ప్రద్యు-లేక వీరును వారునుఁ గలసి మనపైకిదాడి వెడల నుద్యమించిరేమో?

(అక్రూరుఁడు ప్రవేశించుచున్నాడు.)

అక్రూ-శ్రీకృష్ణబలభద్రులారా? నమస్కారము.

కృష్ణు—అక్రూరా! శుభమగుగాత! ఎప్పుడువచ్చితివి?

అక్రూ-మురాంతకా! ఇప్పుడేరథంబు మనకోటమొగసాల నిలిపి మిమ్ముజూడ నరుదెంచితి.

శ్రీకృ--మంచిది, హస్తినాపుర ప్రయాణోదంతం బాద్యంతంబుగా నుడువుము.

అక్రూ- చిత్తము. దేవకీనందనా! నిన్నటిదినంబిచ్చటనుండి బయలుదేరి యతిత్వరితరథగమనంబునఁ బద్మినీకాంతల దనసహస్ర కరంబుల ముద్దాడుచు దేజోపటలంబు సర్వదిశలంగప్పుచు బ్రచండంబుగ నవ్వేడి వెలుంగునడిమింట బ్రవేశించుతఱి హస్తినాపురిందరిసి మారుతంబున దిక్కులు పిక్కటిల్ల దటతటంగొట్టుకొను గొంగ టెక్కెల పోల్కెనతి ధవళంబులగు కేతనంబులతోడను, వాయువేగంబును ధిక్కరించుచు నానావర్ణముల నొప్పి యెప్పుడెప్పుడని తొందర పడుచున్నట్లు ముంగాళ్ల డెక్కల భూమిఁ గ్రక్కదలఁద్రవ్వ తత్ఖురోత్థూతధూళి రేణుసము దాయంబంబరంబుగప్పు మబ్బుపట్టినట్లు దలంచియాశ్చర్యంబుగాంచు జనంబుల హేషాధ్వనులచేఁ తిగరవు తురంగబృందంబుల తోడను, దిగ్గజశ్రేణి సైనను నూకనుమురుగావించు తలంపునగర్వంబునకు బిల్చుచున్నవో యన్నట్లు గండుమీఱి తొండంబులు మింటికెత్తి బృంహితంబులజూపరకు వెఱగు గల్పించుచు గాటుకనడ గొండలభంగి నడుదు మత్త వేదండతండంబులతోడను, ఖద్యోతచ్ఛాయల సహజభావశ్యంబులు చెన్నుమీరరణకౌతూహలంబున దపంతటు దాము మోయుచున్న వోయనురీతి గాలిచే భయంకరారావంబుల నీనుశంఖంబులు భుజంబుల బొల్పార రక్కసులధిక్కరింతుమో దేవతలతీటడంతుమో గరుడుల బరిమార్తుమో యక్షులశిక్షింతుమో కిన్నరుల వెన్నాడుదుమో సిద్ధులవీపు బ్రద్దలుసేయుదుమో కింపురుషులం జంపుదుమో సాధ్యులపాథింతుమో గంధర్వుల బ్రమందింతుమో పన్నగులఁగట్టి యాడింతుమో ఖేచరుల పీచంబడంతుమో వీరస్వర్గంబుచూరగొందుమో యనికేకలు వైచుచు హుంకరింపుచు గరవాలంబులు ద్రిప్పుచు జీమచిటుక్కుమన్న నెక్కడెక్కడ యెవ్వఁ డెవ్వఁడు యెప్పుడెప్పుడు పట్టుఁడు పట్టుడు కొట్టుఁడు కొట్టుఁడు పొడుపొడు నరుకు నరుకు కూల్చు కూల్చు మనిభూనభోంత రాళంబులుఁ బ్రేల నార్చుచు మైమరువులు గ్రాల పౌరుషంబులు మూర్తీభవించినట్లు వీరరసంబు స్వరూపంబు దాల్చిన భంగి రౌద్రంబుట్టిపడ లెక్కకుమిక్కుటమై తండోప తండంబులు లక్షలు లక్షలు గొట్లుకోట్లు యక్షౌణు లక్షౌహిణు లెక్కడచూచిన దామెయై, నేలయీనినట్లు పురంబునకు బంచక్రోశంబుల వరకును జోటుచాలక మైమరువు లొండొంటి రాపాడుటచే రాలిన భూషణరజంబున భూమియెల్లబంగారమై కనుటకు శృంగారమై రంగారున భంగపరాక్రమ వీరోపేతంబగు నాక్క మహాసైన్యంబుంగంటి.

కృష్ణ—తరువాత.

అక్రూ-తరువాత నోయదుసింహా! అచ్చోటువాసి ఘనవప్రదుర్గ పరిఖాప్రాకా
విభాసితంబును, వియద్వీథీ పరిచుంబిత విశాలరమణీయోన్నత సౌధజాలం
బులగలిగి, తత్సౌధంబుల నిలుకడగన్న తీగమెఱుంగులో లేకచైతన్యంబు వ
హించిన బంగారుబొమ్మలో యన నపురూపలావణ్య సంభ్రమంబులనొప్పా
ర మందహాస శరచ్చంద్రికల వెదజల్లు శరదిందుముఖులు చూపునకని మిథ్య
త్వం బుత్పాదింప భూపురంధ్రిమణి ముత్యాల పాపటంబోలి పొలుపొంది స
తతగురాజమార్గంబులనొప్పి యిసుకవైచిన రాలకహయారూఢులై గజా
రూఢులై రథారూఢులై కౌరవనాథుం దర్శింపవచ్చునానాదేశాగత రాజచం
ద్రబృందంబులుగలిగి నిత్యకల్యాణము పచ్చతోరణముగాచెలంగి యొప్పారు
హస్తినాపురంబు ప్రవేశించితిని.

కృష్ణ—తరువాత?

అక్రూ-తరువాత నోకంసమర్దనా! అప్పురి సౌందర్యంబు గనుట కింకను వేయిగన్ను
ల నివ్వని విధాతందిట్టుచు మనసు మనసున నుండక బిచ్చియెత్తిన వానివలె
నెత్తిన తలదింపక మెడనొప్పులెత్త సారథినిరథగమనంబు మందంబుసేయుమన
నుజ్ఞయిడి కౌరవరాజ మందిర ద్వారంబున రథావతరణంబుసేసి తచ్చోంద
ర్యంబుం జూచుచు చైతన్యంబుదక్కి స్వర్గంబుననుంటినో లేక సుచే
ంద్రపురంబున నుంటినో యనివిభ్రాంతి నొందుచు నెట్టకేలకు సారథి తెలు
ప సర్వమాణిక్య మణిగణ సముద్యద్భిత్తి మనోహరంబునై నానావిధ చిత్ర
విచిత్ర సముదాయాలంకృతంబై ముక్తాఫలవల్లరీ విలాసంబై విబుధసము
దంబా నింద్రుని సభయుంబోలె గన్నులపండువై వీర స్వర్గంబుభంగి దిగంత
విశ్రాంత కీర్తియుత యోధవీర మూర్తివంతంబై యంగ వంగ కళింగ బం
గాళ నేపాళ చోళ మాళవ బర్బర సింధు యాంధ్ర నాట లాట
కర్ణాట ఖోట పానాట కాంభోజ మహారాష్ట్ర సౌవీర ఘూర్జర
సాల్వ మత్స్య కుంతల మగధ సామంత యవన సవన మద్ర కొంకణ
కొంకణ వెంకణ హూణ పుళింద కుళింద చిరాట కుంట సౌరాష్ట్ర
హేమరాష్ట్ర కురుక కుకు కరూశ పాండ్య కాశ్మీర, త్రిగర్త ఘోట భో
జ మలయాళ కోసల పుష్పితాదిరాజలోకపూజితంబై దుర్యోధన దుశ్శా
సన కురుశతానుజయుక్తంబై కర్ణ వికర్ణ బాహ్లిక సోమదత్త భగదత్త భూ
రిశ్రవ విరాట సైంధవ విందానువింద దృష్టకేతు సుదక్షిణ కేకయ శ

ల్య ఘటోత్కచ భీష్మ ద్రోణ కృపాశ్వత్థామ నీల రుక్మి మహావీరలో
క భయంకరంబై ధర్మజ భీమార్జున నకుల సహదేవాది పాండవసమాజవిల
సితంబై విదురసంజయ సేవిత ధృతరాష్ట్ర మహారాజపాలితంబగు కౌరవస
భంగాంచితి.

కృష్ణు-తరువాత! తరువాత!

అక్రూ-తరువాత నోయదుపుంగవా! ఆరోజున వారలదర్శించి మరునాడు కౌరవసభ
కుంబోయి, ధృతరాష్ట్రునికి బ్రణామంబాచరించితక్కినవారిచేత సంభావితుం
డనై పేరుపేరవారి నేమంబడిగి యంతకుమున్న నాకయింతిచేత నాకొరకై
పెట్టించిన సువర్ణపీఠంబున నాశీనుండనై కుశలపూర్వకంబుగా నుచితరీతివి
నోదాలాపంబుల గొంతప్రొద్దు పుచ్చునప్పుడ జాతశత్రుండు మీమీ నే
మంబులడిగి వచ్చిన కార్యంబడుగ దెలిపి మీరునుడివినరీతి నడిగితిని.

కృష్ణు-ఆతండేమనె?

అక్రూ-ఆతండేమియు ననలేదుకాని, సభలో దుర్యోధనుండు మీసములు మెలివెట్టు
చు మీరుచంపెదనని ప్రతిజ్ఞఁబట్టిన రాజేంద్రు నర్జునుండుకాచినాడనియు
శరణుజొచ్చినవాని విడువమనియు యీసర్వసైన్యంబులు నానాదేశాధీశ్వ
రులును, గూడుటకు గారణంబిదియేయనియు, రాజునురక్షించుటో, నెపములే
ని మీప్రతిజ్ఞ మాన్పించుటో నిశ్చయించుకొంటి మనియు బెద్దయుంబ్రొద్దు
యుపన్యాసంబు సలుపుదగిన యుత్తరంబు లిచ్చితిని.

కృష్ణు-(కోపముతో) ఆహా! ఏంతవాడవైతివి? కౌరవ పాండవులు కలయుదెందు
కో యనుకొంటిని. చివర కిదియాసమాచారము. కానిమ్ము దుర్యోధనుండే
మనె?

అక్రూ-మీవంటివారు వినగూడనివియు మావంటివారు చెప్పరానివియు గొన్ని గర్వ
తో ప్రలనాడెను.

కృష్ణు-(కోపములో) ఓరీ! దుర్మార్గా! దుర్యోధనా? నన్నునిందించితివా!

ఉ. కొంచకనస్త్రశస్త్రములుఘోరరణంబునమేననాటిసు్రి
క్కించగ, జక్రవాయుసఖకీలలుబాయక వెంటనంటర
క్షించుము, తప్పుజేసితనిచేతులపాదముపుట్టినిందగా
వించినయీఫలంబనుభవించనటంచుదలంచియుంటివా!

ఉ. బంటువుబోలెనే ప్రతినబట్టినమానిసిగా వసిద్ధమై
యుంటినటంచు బ్రేలితె? రణోర్విని నాకెదురౌచునిల్వనీ
కొంటివె? యెవ్వరంచు ననుకొంటివొ? నీబ్రతుకింక నిశ్చయం
బంటివె? యెట్లుమాన్తునని యంటివి? నాప్రతినంబుగొల్వలోఁ.

పిఱికిపందా! బ్రహ్మదులే నాప్రతిజ్ఞ మాన్పలేరుగాని యిఁక నీవా మాన్పించువాఁడవు. ఏమీ?

మ. కొలువుంజేరిన రాజులందఱు వినన్ గ్రూరాత్ముఁడా కృష్ణునిం
గెలుతుంజూడుఁడటంచు బల్కు వెరపో నీకుచ్చుటప్పాలులో
కులకుం జెల్లము, నాదుపౌరుషము నీకుందోచు, దేహంబున
క్కలుగ్రద్దల్ వకూడిచీల్చుతఱి? సంగ్రామంబునన్ మూఢహా.

చిఱుకాలంబుననుండి కన్నుమిన్నుగానక బహుశౌర్యవంతుఁడనని విఱ్ఱవీగుచున్న నీత్రుళ్ళడగించు సమయంబుకాక తాళీయంబుగ సంభవించినది తొందరపడకుము. ఆక్రూరా! తరువాత?

ఆక్రూ-తరువాత. మీకై చింతించుచున్న ధర్మజుంజూచి కర్ణుండిట్లనియె.

కృష్ణు-(కోపములో) ఏమనె?

ఉ. చేలవె? వెఱ్ఱిగొల్లనికి బిమ్మటినొందగనేల? వానివా
చాలత? బాహుదర్పబలశౌర్యము లెల్ల నెఱుంగమొకొ! భూ
పాలుని జేరనిత్తుమొకొ? భండనభూమిని నిల్వనిత్తుమే
కోలలజిమ్మి యాదవుల గొల్లుమనంగను జేయకుందుమే.

అనునాదిగాఁగల దుర్భాషలాడ దగినట్లప్పుడే ప్రతివచనంబులిచ్చితిని.

కృష్ణు-(కోపముతో)

ఉ. పాతక! మత్తచిత్త! సులభంబుగనోటికి రానితుచ్ఛమా
కూతలుగూసినన్ను గురుకొల్వునగొల్లఁడటంటివాజిలో
జూతువుగొల్లపౌరుషము శూతునిశౌర్యము బొంగకిప్పుడో
హా! తులువా! తలంచుమెద! నున్నవి ముందుముసళ్లపండుగల్.

తరువాత!

అక్రూ—తరువాత దుశ్శాసనాది దుష్టులు పెక్కునపేలి పడినసమాధానంబు చెప్ప నిష్టములేక నూరకొంటిని.

కృష్ణు—మంచిపనిజేసితివి? భీష్మద్రోణాదులేమైన మాట్లాడిరా?

అక్రూ—శ్రీకృష్ణా! నేనుపోవుతటి భీష్ముని సందర్శించి, వృత్తాంత మెఱింగియే పోయితిని. అతండార్జున గొల్వునకు రాలేదు. దుష్టచతుష్టయము ద్రోణాదుల దూలనాడవారు కోపించుకొని కొలువు వెడలి పోయిరని చూచాయగా వింటిని. కౌరవులుతప్ప పాండవులలోని వారెవ్వరు పన్నెత్తిపలుకగా వినలేదు. కాని యిప్పుడు నేను ధర్మరాజుతో భిన్నతనంబున నుండియు, గడుగూర్చు బాంధవుండై, కాపాడు దైవంబైన కృష్ణునితో విరోధించుట గూడదనియు, ఉతుర్గుని విడువుమనియు, నెన్నిసారులు చెప్పినను వినక, శరణార్థిని విడువుమని చెప్పి మీతో నామాటగా నిట్లు చెప్పుమనియె.

సీ. వనజాక్ష నిన్నన్న వసుదేవునకు గూర్మి
చెల్లెలు కుంతిమాతల్లి యనుము
భావింప బాండవుల్ బావమరందులు
పై వారు గారు నీభక్తులనుము
యెన్నఁడు నీయాజ్ఞ కెదురాడె రుంగరు
కరుణతో నీతప్పు గావుమనుము
యీ రాజునకు మమ్ము నిబ్బంది బెట్టిన
నరపతుల్దేవతల్ నగుదురనుము.

గీ. దయను జూపంగ నీకిదే తరుణమనుము
మెంచఁగా నీవె దిక్కు మన్నించుమనుము
కలను దలఁపని కలహంబు గలిగెననుము
కుంతికానుపు నిర్భాగ్యవంతులనుము.

కృష్ణు—పాపము, ధర్మరాజెప్పుడును, నాయందు పితృభక్తి గలవాఁడు. అతఁడు నామాట కెప్పుడెదురాడడు. మేటిపోటరినని విఱ్ఱవీగు యర్జునుండు నాతో కక్షంబూన నెంచుకొన నాతఁడేమి సేయును? పాండవులందరిలో నాతఁడే యుత్తముఁడు. తరువాత?

ఆకూ్రి-తరువాత భీముండిట్లనియె.

ఉ. చిరతరకీర్తి; ధర్మజుఁడుచింతిలిదీనతతోడఁబల్కనీఁ
డారచియుగాదు, బాంధవముపోవునటంచునుగాని, కిరీటిసం
గరమునగాచినట్టిజనకాంతునిముట్టగశూలివచ్చినన్
సరగునద్రుంతునంచుసభజాటుమువీరులెఱుంగనట్రురా?

చతుర్థమునఁగాచిన నన్నియుఁ జక్కనగుననియునుము. లేకున్న.

చ. ఎఱుఁగుదుగాసురాసురులకెల్లనజేయుని నింద్రసూతి, ము
న్నెఱుఁగుదుగాదె? సర్వరిపుబృందముజీల్చెడు నన్ను భీము, నీ
వెఱుఁగుదుగాదెనాబలము. నేర్చెరనీరణకౌశలంబునే
నెఱుఁగుదునంచుబల్కుమిఁకనించుకసంశయముంచకుండగాన్.

కృష్ణు-(తలపంకించుచు) చిన్నప్పటినుండియు నాతని నెఱుంగుదు. ఇదికొ్రత్తగా
దు. అతని నోటినుండి ముచ్చటకైన సామవచనంబు వచ్చునా! క్రిందపడి
నను మీదివానివలె గర్వితోక్తులాడక మానునా! కానిమ్ము, తరువాత?

ఆకూ్రి-తరువాత. నీప్రియమిత్రుండును, గడుగూర్చు మరందియునగు, నర్జునుండు, క
న్నుల నశ్రుకణంబులొలుక దైవకృతంబిట్లున్నదనియు, మొట్టమొదటి శ
త్రుఁడు కృష్ణుండు వైరియని చెప్పుమి చే నేనుకాతునని ప్రతినజేసితినని యు చెల్లి
నామాటగానిట్లు మనవిచేయుమనె.

సీ. నెనరువాడనుపిన్నతనమాదినొకకంచ
మందునదినినమురందినను మ
యకట! బాల్యంబాదినలరినమన నెయ్య
మడవివెన్నెలసేయుటుడుగుమనుమ
యింతవానిగజేసియిప్పుడు తెగజూడ
బెంచినచిల్కనుద్రుంచుటనుమ
గారాబుతోబుట్టుకంటనుదడిపెట్టి
యింటికినశుభమంచెంచుమనుమ.

గీ. స్వల్పకార్యంబులనుపట్టుపట్టకనుమి
నాదుకీర్తియుడుప్కీర్తినీదయనుమ
కుంతికినిగర్భశోకంబుగూర్పకనుమ
ఘనతనీచతుర్థను గావమనుమజనుమ.

కృష్ణు—(విచారముతో) అర్జునా! ఎంతటిద్రోహివైతివి?

ఉ. తుంటరులైనదుర్జనచతుష్టయబోధలజిక్కినన్నుడీ
కొంటకునెంచుదంచుమనకుంగలగూరిమిగాఢమైత్రియుక్
మంటనుగల్పుదంచుమదినాటినబాంధవమెంచవంచున
న్నొంటిసె? బుద్ధివచ్చెనిక! కుచ్ఛితమిత్ర! కృతఘ్న! ఫల్గునా!

ఆహా! పార్థా?

మ. పెరిగితిమెప్పుడుక్ గడిదిప్రేమనుబాయక, నొక్కప్రాణమై
దిరిగితిమెప్పుడుక్ రిపునెదిర్చితిమెప్పుడు, గోపగించు ప్రే
మెఱుంగనిప్రాణమిత్రులకునిట్టిప్రతిజ్ఞలుఘోరవైరముల్
పెరిగెనికేమనందువిధిప్రేరణదాటనశక్యమేరికిక్.

అక్రూ—వాసుదేవా! ఇంకనుయర్జుననిగురించి చింతించుచుంటివా! అర్జునుండునీలో జె ప్పుమన్న నీచివరవిజ్ఞాపనగూడవిని మఱియుదుఃఖింపుము.

కృష్ణు—అక్రూరా! ఏమది?

అక్రూ—చ. కలహమునక్ గపిధ్వజముగ్రాలఁగ గాండివమెక్కుపెట్టినిక్
గెలచుటయుండె, రంభకవుగింటను, సాక్కగనీదుచేతిలో
బొలియుటయుండెగానియిఁకమూడవమార్గము లేదు, నేనని
శ్చలమతిగాతునన్ననృపచంద్రునివీడనటంచుదెల్పుమా.

కృష్ణు—(కోపములో) పార్థా! అట్లనా? నీవుకాచిననృపుని విడవా? గాండివముచేత నున్నదనికాఁబోలు విఱ్ఱవీగుచున్నావు. కానిమ్ము. నీతలబిరుసు నిన్నేయడంప గలదు. నీగాండీవ ప్రభావంబును, నాచక్రమహాత్మ్యంబును నీవేయెఱుంగుదుగాక. నాప్రతిజ్ఞ నీవుమాన్పెదవా! ఇఁకనిన్నూరక విడచిపెట్టరాదు. (బలరామునిజూచి) అన్నా? బలరామా! చూచితివా? మనయర్జునుండెంత వాడయ్యెనో! మనలో చెప్పుచునిన వాక్యంబులిప్పుడు వింటివిగదా? సాత్యకీ! వింటివా? ప్రద్యుమ్నా! వింటివా?

సీ. తలఁపఁడో తనపిన్నతనమాదితనకోస
మైనేనుపడ్డట్టియవధినెల్ల
భావింపఁడో సుభద్రావివాహమునకు
నేఁజేసినసహాయ్యమెల్లమదిని
ఎంచఁడో జ్ఞాతులపంచఁజేరితపించు
వంచనబడకబ్రోచుంచువిధము
జ్ఞప్తికిదెచ్చుకొనండా? మేనత్తకు
మారుబంధుత్వంబుమైత్రినెల్ల.

గీ. నల్వురునునవ్వరోకో? వినాశకాల
మునకుదప్పకవిపరీతబుద్ధివొడము
ననెడిపెద్దలపలుకుప్రత్యక్షమయ్యె
పార్థ? గోముఖవ్యాఘ్రమాబల్లిర? తెలసె.

బలరా-కృష్ణా! వింటిని. పిన్నతనంబున నుండియు, నీవుపాండవపక్షపాతివై, యందు లోనర్జుననకై శ్రమపడి, యారవపార్తింబుగాఁ జూచినందుకు, ఫలమీరీతి గఁజూపి యుక్కుమిగిలి చివరకు నీకేపంగనామములు దిద్దినవానిని విడువఁజ నదు.

సాత్యకి-హరిహరీ! (చెవులుమూసికొని) తినిన యింటివాసంబులు లెక్కనిడిన కృతఘ్నుఁడగు పార్థునిపేరు తలఁపరాదు. వానిగర్వం బడంచక నూరుకొనరాదు.

ప్రద్యు-(నవ్వుచు) సాత్యకీ! తిననియింటి వాసంబు లెట్లులెక్కనిడుదురు? వానినిమ నమేయింత వరకుదెచ్చితిమి.

కృష్ణు-(విచారముతో) అక్రూరా! నిష్కారణకలహంబు గలిగినందుకు చాలవిచారముగానున్నది. అహా? అర్జునా! అర్జునా?

(సహదేవుఁడు ప్రవేశించుచున్నాడు.)

సహ—శ్రీకృష్ణ! బలభద్రులారా! నమస్కారము.

కృష్ణు—(లేచికోపముతో) ఓహో! పాండవదూతలగు సహదేవులా? ఇట్లుదయనే యుఁడు.

సహ—చిత్తము. (అనికూర్చుని కృష్ణా! అందఱు నేమమేకదా? వసుదేవాదులు క్షేమమా!

కృష్ణు—(కోపముతో) మీయందతిదయవలన సందరము క్షేమముగనున్నారము.

సహ—పురాణపురుషా! విశేషములేమి?

కృష్ణు—మీదర్శనముకంటె విశేషములేవుగాని, మీరాకకుగతంబేమి?

సహ—వాసుదేవా! నిష్కారణంబుగ నీవుచంపెదనని ప్రతిజ్ఞబట్టిన చతుర్థునినియర్జునుండెఱుంగకగాతునసిఘోరప్రతిజ్ఞజేసినమీతోనిష్కారణవైరంబుతలకొనుటెఱింగి, ధృతరాష్ట్రభీష్మాదులయనుమతంబున ధర్మరాజునన్ను భవత్సన్నిధానంబునకు బంపునప్పుడు నామాటలుగా జెప్పుమన్నపలుకులువినుము.

క. నరునకునీకునుభేదం
బరయంగానెపుడుజూడమతినెయ్యముతో
వరలుటలోకము లెఱుఁగును
నరుపై గోపింపనృపులునవ్వరె? కృష్ణా?

ఉ. ఆతతదిక్ప్రపూర్ణమగునద్భుతకీర్తినిగాంచెక్రీడినీ
చేతనుగాదె? సర్వనృపసింహులనాలమునంజయించెనీ
చేతనుగాదె! దిక్పతులచేతవరంబులగాంచుటెల్లనీ
చేతనుగాదె? శోభనముజెందెనుయాదవవంశవర్ధనా!

క. నినుప్రేమించునుమన్నిం
చును, నిన్ఖ్యానించు; భక్తిమాపుచునెన్నం
డునునీదుమాటకడ్డుగ
జనియెఱుఁగనిపార్థుగావజనదగుననుమా.

ఉ. ధారుణినాథుఁడెప్పగిదిదప్పొనరించెను, దైవికంబుగా
జారిననోటినుర్వనకుజంపదలంచుటధర్మమొక్కొ? ని
ష్కారణము. న్నిధర్మములుగాంచినదైవమవీవెఱుంగవే
దూరముచింతజేసినృపధూర్జటిప్రాణముగావుమాధారీ.

చిఱకాలబాంధవ్యమును, ప్రేమయు, స్నేహమును, జెఱచుకొనుట మంచిది కాదు. మాధవా? నామాటవినుము.

కృష్ణు—(కోపముతో) బలభద్రులారా?

గీ. వింటిరే? పాండుపుత్రులవేడఁబనులు
తాముపట్టినప్రతిజ్ఞనసత్యంబుసేయ
నేనొనర్చినప్రతినమానమంద్రుఁడు
వారెతెగుమనుష్యులభంగిభయముపాసి.

పాండవదూతా!

సీ. శతదేవేంద్రులు, వేయిబ్రహ్మలు, దశేశానుల్ సురల్ సర్వదీ
క్షితులేకంబయివచ్చి పేర్చిననమోఘాలంఘ్యమైయొప్పునా
ప్రతినంబారడిగాదువిన్నవె? సహదేవా! చక్రమస్మత్కరా
గతమైనప్పుడుకాళ్లుచల్లవమువేగక్షైవైరినర్పింపుడీ.

సహ—చక్రపాణీ!

గీ. ఇంతకోపంబుఁజూపమేమెంతగలము
దేవరకుభక్తవరులముసేవకులము
తప్పొనర్చియొఱుంగముతమకుదగునె?
యాలమందలనదలించినట్లదల్ప.

కృష్ణు—(కోపముతో) చేసినతప్పులుచాలవా! ఇంకేమిచేయవలెను.

సహ—నిష్కారణంబుగ నిర్వ్యాజ కృపాకలిత మానసులై యిట్లనుచున్నారే సత్యసంధ

యముగా మావలన దప్పేమున్నది?

కృష్ణు—(కోపముతో) ఇంకను సిగ్గులేక దప్పేమనియడుగుచున్నారా!

సీ. నేనుచంపెదనన్నమానవనాథుని
దమయన్నకాచుటతప్పుకాదె
కూరిరకౌరవులనుగూడినన్గెలువంగ
దమరెల్లదలఁచుటతప్పుకాదె
కురుకోల్వినందునకూరిరుచెంగటనన్ను
దమరెల్లదూషింపదప్పుగాదె
నీప్రతిజ్ఞనుమానునీరజాక్షయటంచు
దమరిప్డుపలుకుటతప్పుకాదె.

గీ. వచ్చినను జత్తుమా నృపచంద్రుని ప్పు
దలచమని వార్తనంపుట తప్పుగాదె
మీరు చేసిన తప్పులు మీకె తెలియు
విప్పి మీ తప్పు గుప్పల జెప్ప నేల!

సహ.—సీ. అపకారి కానట్టి నృపతీశ్వరుని బట్టి
తలద్రుంప నెంచుట తప్పుకాదె
దైవికంబున దటస్థంబైన పనికి శా
పంబు మానికి నియుట తప్పుకాదె
మంచిచెడ్డలు విచారించక గాంచక
ధర్మంబు దప్పుట తప్పుకాదె
యెఱింగియు మ్మిన మాయహారిరూపమా రంభ
దండింపకుండుట తప్పుకాదె

గీ. పరుల తప్పులు వెదుకంగ ప్రౌఢులంత
తాము చేసిన తప్పుల దలంచ రెవుడు
తప్పు లేనట్టి వారలీ ధరణి గలరె
దేవుడ వెఱుంగవే! వసుదేవతనయ.

కృష్ణు.—చాలు చాలు. కృతఘ్నులారా! పిన్నతనంబుననుండియు మీకు జేసిన మేలు మఱచి నా తప్పులెంచెదరా!

సహ.—అనియనిపించుకొనుట యత్తగారి సీప్రఖ్యావమున్నట్లు మనస్సులు చెడిన తర్వాత నొకరి నొకరన నూరకొందురా? పాండవు లెప్పుడును కృతఘ్నులు కారు.

కృష్ణు.—(కోపముతో) నాకు బంధువులై, నాకు గడుంగూర్చువారలై యున్నందున నాకుం దోడ్పడి నా మాట చెల్లించుటకు బదులుగా నా ప్రతిజ్ఞ మాన్పింపం దలంచి యెదురు తిరుగుట కృతఘ్నత కాదా?

సహ.—ఉత్తమక్షత్రియోచితంబైన శరణాగత రక్షణము కాని కృతఘ్నత యెట్లగును? కావున నేమిమిమ్మట్లు బ్రతిమాలుటకును, సేనవచ్చుటకును గారణమైనది

కృష్ణ—(కోపముతో) బాగుగాచెప్పితివిగాని నామాట చెల్లింపకూడదా!

సహ—మామాటమీరెందుకు నెగ్గింపకూడదు?

కృష్ణ—(కోపములో) మీయన్నదమ్ములకింత నాపైకక్షయేల?

సహ—మీకింత వెంకి పట్టేల?

కృష్ణ—మీయర్జునుండిం తవాడగునని కలనైన దలంపలేదు.

సహ—మీరింతవారగుదురనియర్జునుండును దలంచలేదు.

కృష్ణ—(కోపముతో) అర్జునుండెంతలోనన్ను మరచిపోయెను.

సహ—అతఁడుమిమ్ము మరచిపోవుటకు మీరాతనికొనర్చిన యుపకారమెద్దియో తెల
విందు?

కృష్ణ—నేనుచేసినయుపకారంబుల కంతమేలేదు. నాసహాయంబు కల్గిన యర్జునుండు
దుర్జయుండు, నాసహాయంబు లేకున్న నరుఁడు. నరుఁడు.

సహ—ఔనౌను.

సీ. ద్రోణునకై మున్ను ద్రుపదుదెచ్చినయప్పు
డజ్ఞాతనీసహాయంబుగానెనో?
యద్భుతంబగుమత్స్యయంత్రంబుగొట్టునా
డజ్ఞాతనీసహాయంబుగానెనో?
ద్రౌపదికై మున్ను రాజులగెల్చునా
డజ్ఞాతనీసహాయంబుగానెనో?
గర్వోష్ఠి సైంధవుగట్టితెచ్చినయప్పు
డజ్ఞాతనీసహాయంబుగానెనో?

గీ. మాటలేటికిముఖ్యమౌ మాటవినుము
గాండివము దేవదత్తంబుగవద్తూనలును
బొందురాశ్వముల్గలిగినవానికేల!
నరయగానాకరిసహాయ్యమంబుజాక్ష!

సీ. ఎవ్వనివిక్రమంబీశ్వరుమెప్పించి,
పాశుపతాస్త్రంబుఁబడయఁజేసె
ఎవ్వనిశౌర్యాగ్ని కెంచఁగఖాండవం
బింధనమైనశియుంచెమున్ను

ఎవ్వనిదోశ్శక్తికింద్రుఁడుచింతామణీ
నవమణుల్ నీరాజనంబులొసఁగె
ఎవ్వనిపౌరుషంబీరేడులోకంబు
లందుగన్నులపండువై చెలంగె.

గీ. నట్టిలోకైకవీరునిననుపమాను
నట్టిఘనధనుర్ధరునసహాయ్యశూరు
నేలదూషించి నిన్నునీవేస్తుతించు
కొందువిదిరాచపాడె? గోవిందచెపుమ.

చ. అనిమొనలోనకృష్ణునిసహాయ్యముచేతనెగెల్చుగాంచెన
ర్జునుడని మధ్యవర్తులుపరోక్షమునందునసాక్ష్యమిచ్చినం
తనెనినునమ్మవచ్చునుయదార్థమటంచును, యిప్పుడేలదూ
షణలు. ముఖాముఖిన్ బడినజక్కఁగదేలవె? కంసమర్దనా?

కృష్ణు—గీ. ఇంతవాడనిముమ్ము నే నెఱిఁగియున్న
యిట్టిబాంధవ్యస్నేహంబులెఱిఁగియున్న
నర్జునునిమోముజూతునేయక్కటకట
తెలియజాలకముప్పునేదెచ్చుకొంటి.

సహ—గీ. తెలిసితెలియకనోమున్నసలిపినావు
చెప్పినట్లనేఘుకముందుసేయరాదె
ముప్పులేదిప్పుడికముందుమూడునేమొ
పచ్చునింటనీయశుభంపుపల్కులేల?

కృష్ణు—అయినను మీయన్నశౌర్యంబు నాకుగొత్తకాదు.

సహ—బావా! ఎవ్వరిశౌర్య మెవ్వరెఱుంగరు?

కృష్ణు—(కోపముతో) నీతోవితండవాదంబు లెందుకుగాని;

క. గెడపబ్రతిజ్ఞనుఁబట్టిన
పుడమియొడయునింకనింద్రపుత్రుఁడునాకై
విడచునో? విడువఁడో! చెపుమా
గడుసుదనంబాలమందుగాంచెదననఘా.

సహ—క. శరణాగతరక్షణమే
పరమార్థమటంచునమ్ము పార్థుండాభూ
వరువిడువఁడువిడువఁడునీ
గరువంపు బ్రతినంబుమాన్పగలఁడ బ్రాత్మా!

కృష్ణు—(నవ్వుచు) ఏమి! నీధీరోక్తులు?

(బలరామ, అక్రూర, సాత్యకి, ప్రద్యుమ్నులు, చప్పట్లుజరచుచు గేకలు వైచుచు నవ్వుచున్నారు.)

బలరా-అక్రూరా! చూచితివా! ఇంకేమున్నది? ఇంకేమున్నది?

అక్రూ-సాత్యకీ! ఏమి! యీ ఆశ్చర్యము. అర్జునుఁడు శ్రీకృష్ణునిజయించునట! ఏమి! వీరిశౌర్యము.

సాత్య—ప్రద్యుమ్నా! చూచితివా? ఈ చిత్రము.

ప్రద్యు-(సహదేవునిజూచి) కృష్ణుని గెల్పునంత వీరుఁడు నేటికి బయలువడె. చెప్పుటకీసహదేవుఁడెంత సిగ్గుమాలినవాఁడురా! (నవ్వుచున్నాఁడు.)

సహ—(తనలో) అర్జునుని శౌర్యంబు వెల్లడించితినని కాబో లీయాదవులు నన్ను హేళనము సేయుచున్నారు. పాండవులంత పనికిమాలినవారని యేమో వీరి యుద్దేశ్యము. వీరినవ్వులు; వీరిగేలిగొట్టుటలుజూచి నాదేహ మెల్లెడలమండుచున్నది. (కోపముతో) బలరామాదులారా!

గీ. వైరమెప్పుదుమనవారుబంధులంచు
ప్రేమనెమ్మదిమీరగెల్పితినిగాని
కడఁగిమమ్ములగదనరంగంబునందు
గెలువజాలరుమీరునవ్వులకె? గాని.

మురాంతకా!

మ. కలితాఖండలశౌర్యమొప్పనని లోగాండీవముంబూనిని
శ్చలతఁ బార్థపయోధరంబడరిశస్త్రాస్త్రాగ్ని విద్యుల్లతాం
చలదుర్వారనిశాత ఘోరశరవర్ష శ్రేణివర్షింపగా
నిలువన్నేర్తువె! యీసభాసదులలోనిక్కంబుగానొక్కఁడున్.

కృష్ణ—(నవ్వుచు) ఆహా? మాదేర్రియా!

చ. నిజమునిజంబుపాండుధరణీవరుపుత్రులుభూరిమత్తది
గ్గజములవంటివారు, రణకౌశలులంచితమూర్తులష్టది
గ్విజయులుశౌర్యవంతులరిభీకరులార్తశరణ్యులుత్తముల్
సుజనులరౌరెఱుంగుగదలోకములిప్పుడుజెప్పనేటికిన్.

సహ—(కృష్ణుంజూచి)

చ. వినుతపరాక్రవంతులగుభీష్ముఁడు, చాపగురుండు, భీముఁడున్
ఘనులగుధార్తరాష్ట్రులును,గన్నడి,కర్ణుఁడు,ద్రౌణియుం,గృపుం
డునునకులాదివీరులుగడున్ గృపగాచుచునున్నయాచతు
ర్థనుదగియంగశక్యమె! దురంబునమీబలమేమెఱుంగమే?

బలరా-(కోపములో) ఏమి! శ్రీకృష్ణభుజబల పరాక్రమంబెఱుంగని రీతిబల్కెదవేల? నిజముగా వాసుదేవుని పరాక్రమవహ్నికి నర్జునుండొక తృణాకృతిసుమీ! ఇఁక భీష్మాదివీరులును; ధార్తరాష్ట్రులును, మీరును, మేమెఱుంగనివారలు కారు. చాలుచాలు. మాదేర్రియా!

చ. ఘనుఁడుకిరీటియొక్కఁడె నృపుగాచెను, కావుముకృష్ణయంచుపా
ర్థనలనుసల్పుచున్ బలుకరానివిపల్కుఁగసిగ్గులేదె? నె
మ్మనమున. నింకనీపడుచుమాటలబింకముగట్టిపెట్టుమే
మనుకొనినావొ? మమ్ముదురహంకృతిగొల్పకదారిబట్టుమా.

చిన్నవాడవనియు, దూతవనియు, నెంతయాలోచించి యూరకొన్నను, గట్టు నబడిన చేపవలె మిడిసిపడుచున్నాడవు.

శా. హేళిన్మధ్యనలాంగలాగ్రమునసప్తాంభోధులింకింతునో
కేళిన్ధారుణిబెల్లగించెదనొ? యక్షీణోగ్రశౌర్యానల
జ్వాలన్ముజ్జగముల్హరింతునొ? ప్రలంబఘ్నుండనాకెంచఁగా
నీలోకంబునరాజకీటములులెక్కే! చూడమాద్రీసుతా.

సహ—(నవ్వుచు) బలరామా! ఈయాత్మస్తుతి యెవ్వరెఱుంగనిది.

ఉ. పౌచ్చెము లేక గాండివముబూనుచు మూకలజెంచినాజివి
వ్వచ్చుడు క్రీడసల్పుటకువచ్చిననిప్పటిబీరమాగునే
చిచ్చొడిగట్టియుం బ్రతుకజెల్లునె! ఫల్గుణునీవెఱుంగవే
గ్రచ్చరపానికంటబడగల్గిననాగలిచేతనుండునే.

ఉ. పెల్లునవిందులన్ దునిమి పెంపర దేరులగూల్చి, వాజులన్
దొ్రళ్ళగనేయబగ్వడికదెంపుగనిల్తురె! తాొ్రటియాకుచ
ప్పుళ్లకుభీతిచే బెదరిపోవునె! తుప్పలయందునున్నకుం
దేళ్ళిటువంటిప్రజ్ఞలకుదీరడివన్నియుగట్టిపెట్టుమా.

ప్రద్యు-(కోపముతో) చెవులు తడకలుగట్టునట్లు పార్థుశౌర్యమేమి పొగడుచుంటివి? సహదేవా?

ఉ. చాలునుచాలుపాండుసుతశౌర్యమెఱుంగమె? గ్రుక్కద్రిప్పకీ
లీలనుజెప్పుచుంటివవలీలజతుర్ధనుగావనున్న భూ
పాలుర మచ్చరాగ్నులనువ్రాల్చుచునార్చుచుబేర్చుకిన్కతో
నాలమునందునిల్చురయంబునజీల్చుచుగూల్చిగెల్చెదన్.

సహ—(నవ్వుచు) ప్రద్యుమ్నా? మన్మథా! పులినిజూచి నక్కవాత బెట్టికొన్నట్లు వీరినిజూచి నీవుగూడ బీరంబులాడ జొచ్చితివా?

సీ. గొరవంకకోకిలసరసగానముకాదు
రణభేరిభీకరరవముకాని
చేపసిడంబొప్పుచిలుకతేరులుకావు
భయదకేతనరథవ్రజముకాని
భామినీదృక్కోణబాణజాలంబుగా
దగ్నికల్పాస్త్రచయంబుకాని
బీరంబుచూపంగవిరహిజనముగాదు
ధారుణివీరబృందంబుకాని.

గీ. చెఱకువిండులు కావవి కఱకువిండ్లు
ప్రాణములబుచ్చుకొనుసంగరంబుగాని
పూవుఁబాన్పులనాటలుగావనంగ
మేటివాటరివోలె? నీమాట లేల!

కౌరవ పాండవులు వట్టివారనికాబోలు మీయభిప్రాయము.

సీ. పరశురామునిభంగపరచినభీష్ముని
ననిలోన గెల్వశక్యంబె మీకు
నతిరథశ్రేష్ఠుద్రోణాచార్యురణములో
గన్నెప్పిచూడఁగాగలరె మీరు
కాలాగ్నిరుద్రుఁడై క్రాలునశ్వత్థామ
గానుపించిననిల్వఁగలరె మీరు
ద్వాదశార్కులట్రమింగుపగిదిగర్ణుఁడుదోఁప
మీరలనెవ్వరైన జేరఁగలరె?

గీ. కృపుని రారాజునాజిలోఁ గెలువఁగలరె
యలఘుటొత్కజభీములనడఁపఁగలరె
యాలమునవిల్చి మీరుపోరాడఁగలరె
వట్టిడంబంబులకునులాభంబుకలదె.

మఱియు వైరుల గయ్యంబున గెలువ గంకణమ్ముగట్టుకొనిన క్రుపశాదులతో పోఁడరగలరా! మహావీరులగు బాహ్లిక, సోమదత్త, భగదత్త, భూరిశ్రవులతో నెదు రొడ్డనఁగలరా? సుదక్షిణ, కేకయ, నీల, యవన, శకుని, విందానువింద, రుక్మి, ద్రుష్టకేతులతో నెదురింపగలరా? పాండ్యవిరాట సింధునృపసింహులపై విండ్లెత్తి మసఁగగలరా! అంగవంగ కళింగాది నానాదేశ-గత రాజశిరోమణుల గాలిదగిలిన దిక్కుబలము జూపెట్టకుందురా? వచ్చినవాని సంగతి తెలియక, బండ్లిగిలించి, యొహోహోయని నవ్విన నేమి ప్రయోజనము? (కోపముతో కృష్ణునింజూచి) కృష్ణా! వీరలందఱు నుంగలనీ మహాపరాక్రమ వంతుఁడగు నర్జునుని ప్రతిజ్ఞ నిల్పగలరు. అందులో నావంత యైన సందియములేదు కావున.

ఉ. ఘోరునబందుగుల్ పొలిసిపోవకమున్నను, రక్తవాహినుల్
పారకమున్న, యాదవులుపాణికృపాణులతోడ భూమిపై
జేరకమున్న, సైన్యములుచిందరవందరగాకమున్న, మా
ధారుణినాథుగావుమిఁకతక్కనబుద్ధులుగావుమాధవా.

వఁటియు

సీ. దేవదత్తరవంబుదిశలఁబ్రీల్పకమున్న
గడిమిగాండీవమెక్కిడకమున్న
దెల్లగుఱ్ఱపుతేరుతిరుగులాడకమున్న
గపికేతనంబునుగనకమున్న
నక్షయాస్త్రశ్రేణులరుగుదేరకమున్న
వసుధేశులుర్విపైబడకమున్న
మురువొప్పనవ్వేడుమోముకందకమున్న
నొడలెల్లగడుతూట్లుబడకమున్న.

గీ. స్నేహమునుబాంధవంబునుజెడకమున్న
కొలవిచేబూనితలగోకికొనకమున్న
మున్నుపార్థుండుకాచినభూపచంద్రు
గావుమిఁకవట్టిమాటలుగావుకృష్ణ?

కృష్ణు—(కోపముతో) పాండవదూతా! దుర్వారప్రగల్భ వాచాడంబరకౌశలా! సహదేవా? ఏమీ! మీయర్జునుండు రణంబున నన్నుగెలచుననియు, నాకపకారం బొనర్చిన తుచ్ఛుని రక్షింపుమనియు, నన్నుభయపెట్టుచున్నావా! నేనుతలంచిన మీరలందరు నిల్తురా!

మ. మునునేనొక్కనినూల్తునంచుబ్రతినంబున్ జేసితింగాని, మ
ఘ్నచక్రంబునధర్మజున్ విడచికోత్రిధంబొప్పమిమ్మందరన్
రణరంగంబునఁద్రుంతు లేనియెడవిన్నా! దేవకీదేవికిన్
జననంబందినవాఁడగానుయదువంశంబందుమాద్రీసుతా!

(ఆకాశవాణి) ఈఆదిదేవుని ప్రతిజ్ఞతప్పకఁ జరుఁగుగాత?

సహ—(కోపముతో)

క. రోటతలదూర్చి రోకటి
పోటునకున్ జంక నేల! పోనిమ్మనిలో
నోటమి గెలుపెవ్వారికి
వాటిలునో! యిపుడు తెల్ప భావ్యమె? కృష్ణా!

ఉ. లోకులు చూచినవ్వ మనలో మనమే యిటు గ్రుద్దులాడగా
బైకొనగాదు, ధర్మసుతు పాలన సేయుము, లేక పార్థుపై
రోకయినన్ గనుంగొనుము, రోషము కూడదటంచు దెల్పనీ
వీకరణిన్ దలంపనిక నేమన నేర్తును రుక్మిణీప్రియా!

ఉ. లాతివిగావు నీవు సకలంబు నెఱుంగుదు మంచి చెడ్డలన్
జూతువటంచు నెంచుచు, ద్రిశుద్ధిగ సంధికి బంపినట్టి యా
పూతచరిత్రు గౌరవము బుగ్గిని గల్పుచు బాంధవంబు చే
సేతల బాడు సేయుటకు సిద్ధుడవైతి? బలే! మురాంతకా?

చ. కరుణ వెలార్చి, సంగరముఖంబున జక్రము చేత మమ్ము నం
దర దెగటార్ప దుఃఖపరితాపము బొందెడి ధర్మరాజు నే
వెరవున జేరు దే మొగము వెట్టుక చూచెదు, సిగ్గు లేక న
ల్వురదల నెట్టులెత్తుకొని భూమి జరింతువు బంధునాశనా!

నా దూతకృత్య భారంబు నిర్వర్తించితిని. కృష్ణా!

గీ. ధరణిశరణార్థి గావంగ వెరువ మెపుడు
ధర్మసంగరమన్న నుదలక మెపుడు
పూనికలనైన బలికి యుబొంక మెప్పు
డన్నిటికి సిద్ధమై యుంటి మబ్జనేత్ర.

కానిమ్ము. దైవఘటన యెట్లుండెనో యట్లు జరుగక మానదు. వైరమే కర్తవ్యముగా దలంచితివి గాన, నెల్లుండి జయవారంబున గురుక్షేత్ర సమీపశమంత పంచకంబున యుద్ధమారంభింపబడును. నేను పోయివచ్చెద.

(సహదేవుడు నిష్క్రమించుచున్నాడు.)

కృష్ణు—బలరామా! సహదేవుని సందేశంబు నాతని గర్వితోక్తులును వింటివికదా? చతుర్ధనరక్షణార్థంబు, యవంతీవిభులును, విందాను విందులును, విదర్భాధిపతి యగు రుక్మియు, పాండ్యదేశాధీశ్వరులును, కాంభోజసుదక్షిణులును, శిశుపాలుండును, ద్రుష్టకేతుండాదిగాఁగల మనవైరులందఱును, దక్కిన భగదత్తాది బలంబులును, కౌరవ పాండవులును వెరసి పదునెన్మిది యక్షౌహిణులు సర్వసిద్ధంబుగా నున్నవని మనయక్రూరునివల్ల వినియున్నాము. కావున మన బలంబులు సిద్ధపరచుము. జాలము సేయకూడదు. ఎల్లుండి యుద్ధంబు ప్రారంభింపఁబడునని సహదేవుఁడు చెప్పిపోయినాడు. వారివారికి తగినయోధుల నిర్ణయింపుము.

బలరా—సోదరా! మనబలంబులన్నియు, నిదివరకే సర్వసిద్ధంబుగానున్నవి. ఇంత దనుక మనంబున నిశ్చయించియే యుంటిని. నీవుపార్థునికీడుగదా! శైనేయుడశ్వత్థామకుజోడు, వృకధ్వజానకు ద్రోణునకుసరె, చేకితాన బాహ్లికులకుద్దియనిరుద్ధ కృపులకుదగును, యుద్ధవుఁడు మత్స్యనాధునకుసాటి. దీప్తిమంతునకు రాజరాజునకు దూనిక, సాంబుఁడు కర్ణునకు, గదుండు మారుతికి, వృకుండు కేకయులకు, చారుదేష్ణుండు దుశ్శాసనునకు, పుష్కరుండు పాండ్యునకు, కాందినీసుతుఁడు ద్రుపదునకు, సునందుఁడు సుదక్షిణునకు, కృతవర్మ శల్యునకు, శుకుఁడు సైంధవునకు, దగుదురు. జోడీలు బాగుగనున్నవి. నేను భీష్మునితో సరిగాఁబోరగలను!

కృష్ణు—అక్రూరా! ఇంకను మనదక్కిన, యాదవసైన్యంబులకును, రాజులకును, నా యనుజ్ఞఁబంపి రణంబునకు సిద్ధులై రమ్మనమని చారులబంపుము. మీరందఱు సర్వసిద్ధంబుగానుండి కావలసిన ప్రయత్నములు సల్పుము.

అక్రూ—చిత్తము. అట్లనేయొనర్చెద,

కృష్ణు—నేఁటికి కొల్వుచాలింతము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)



# విచిత్ర భారతము.

చతుర్థాంకము - ద్వితీయరంగము.

కౌరవసభ.

(ధృతరాష్ట్ర), భీష్మ, ద్రోణ, కృపాశ్వత్థామ, కర్ణ, ధర్మజ, భీమార్జున, నకుల, చతుర్థవులు ప్రవేశించుచున్నారు.)

ధృత—ధర్మసంభవా! ద్వారకవృత్తాంత మేమైనఁ దెలియవచ్చెనా?

ధర్మ—జనకా! మనమంపిన సహదేవుండింకను రాలేదు.

ధృత—కారణ మేమైయుండును?

ధర్మ—(విచారించుచు) అచ్చట నేమివింతలు పుట్టినవో! ముక్కుపచ్చలారని వానిని దూతగా బంపితిమి.

ధృత—మనసందేశము నాతఁడు మన్నించునా!

దుర్యో-నాయనగారూ! ఏమి? ఈవెఱ్ఱి. మహావీరుండనని విఱ్ఱవీగు కృష్ణుండు తన ప్రతిజ్ఞ నారడిబుచ్చి, యర్జునుని ప్రతిజ్ఞ నాదరించునా? ఆతండొడఁబడినను బలరాముఁడు లూరకుండురా! మన సహదేవుని రాకతో నన్నియు తెలియఁగలవు.

(సహదేవుఁడు ప్రవేశించుచున్నాడు.)

సహ—జనకా! నమస్కారము. సోదరులారా? నమస్కారము. భీష్మాదిగురువృద్ధులారా! నమస్కారము.

ధృత—శుభంబగుఁగాక!

ధర్మ—తమ్ముఁడా! వచ్చితివా! ఇటుకూర్చుండుము. (ఆసనమిచ్చుచున్నాడు.)

సహ—(కూర్చొనుచున్నాడు.)

ధృత—సహదేవా? నీవుద్వారక కేగిన వృత్తాంత మేమైనది చెప్పుము.

సహ—జనకా! నేనిచ్చోటుకదలి రథారూఢుండనై, పోయి ద్వారకప్రవేశించి నగరిమొగసాల రథంబుడిగ్గి, సకలయాదవ వీరనక్షత్ర గణంబున బున్నమినాటి చందురుభంగి బొల్చువాఁడు సాక్షాద్విష్ణుండగు కృష్ణునికి నారాకఫణిహారునిచే విన్నవింప నాతండు నన్నెదుర్కొని దోడ్కొనిపోయి, సముచితాసనంబున

గూర్చుండనియమించి, కోపంబుతో నారాకకు గారణంబడిగిన, సందేశవృత్తాంతము సవిస్తరముగాన నేకరీతుల బ్రార్థనాపూర్వకముగా నాబుద్ధికుశలతయు, శక్తియు వినియోగపరచి, యెన్నివిధంబుల జెప్పవలెనో యన్నిమార్గంబులు జిలుకకు బోధించినట్లు శాంతముగా జెప్పితినిగాని, యాతండు తాను పట్టిన కుందేటికి మూడేకాళ్ళనజొచ్చెను.

ధృత—నాయనా! సంధికాదని యెఱింగియు, నీకునిష్కారణ శ్రమకలుగజేసితిమే. తరువాత.

సహ—తరువాతనో కౌరవనాథా!

ఉ. సారెకుమంచిమాటలనుసంధియొడంబడునేమొయంచుకం
సారికిసామపద్ధతినయంబుభయంబునజెప్పచుండదు
ర్వారతదోకతొ్రిక్కబడుతాి్రచువిధంబునలేచి, యుగ్రుఁడై
సీరధరుండుపల్కినవిచెప్ప గనాలుకయాడదెంతయుఁ.

ధృత—అట్లనా! శ్రీకృష్ణుండేమనె?

సహ—ఆంబికేయా!

ఉ. మీరిటుమాపయింగినుకమేకొనగూడదటంచుదెల్పగా
పాకముదప్పివచ్చెననిపార్థునిచెయ్దిములెన్నినన్నుగూ
రాకువలెన్గణించుచులయాంతకుభంగినిదోచి, క్రొల్వుచీ
కాకువడంగమండిపడెగన్నులనిప్పుకలుప్పతిల్లగఁ.

ధర్మ—(విచారముతో) ఆహా? కృష్ణుఁడెంతటి ఘోరవిరోధియయ్యె. ఎంతనిష్కారణుఁడయ్యెను. తమ్ముఁడా! తక్కినబలరామాది వీరులేమనిరి?

సహ—అగ్రజా! మనపార్థాదులసంగతి జెప్పచుండ బలరామాది యాదవవీరులంద ఱు బ్రగల్భములుఁ గొట్టుచు.

ఉ. కాకులవోలెజుట్టుకొనిగౌరవమెంచకగేలిసేయగా
బైకొనిచప్పట్లుల్జరచి, పక్కననవ్వుచునాకుజీకుతా
టాకులగట్టపాల్పడిననాత్మనురోషముబట్టలేకనే
నాపులవృత్తిచెప్పఁదగునన్నియుజెప్పితిదాచకుండగాఁ.

ధర్మ—ఆహా! తరువాత.

సహ—(విచారముతో) అన్నయ్యా! తరువాత గృష్ణుండు ప్రళయకాల కృతాంతుని పగిదిలేచి, గ్రుడ్డింతజేసి శివమూనినట్లు మైయెఱుంగక.

క. నినుఁవిడచిమన్నుచక్రం
బునద్రుంచెదలేనియెడలభువి దేవకికిన్
జనియింపలేదటంచును
ఘనమగుప్రతినంబుమరలగావించెకృధన్.

క. ధరవడఁకెః వార్ధులింకెను
గిరులదరెను, చుక్కలురిలె, గీడ్వడుచునిశా
కరరవులుదారిదప్పిరి
హరిప్రతినముసల్పునప్పుడత్యుగ్రముగాన్.

అంతట జెప్పనదియు జేయునదియు లేక, రేపటిదినంబున శమంతక పంచకంబున యుద్ధంబు ప్రారంభింప బడుననియు, ప్రాణంబులున్నంతవరకు శరణాగతుని విడువమనియు, దెల్పి రథారూఢుండై మరలితి. ఇదియేసందేశ వృత్తాంతము.

కర్ణ—దుర్యోధనా! గర్విష్టుఁడగు కృష్ణుఁడు సంధి కొడంబడుననియూతలంచితివా? (ధర్మజుంజూచి) ఇంతకును వాని ననవలసిన పనియేమున్నది.

ఉ. కూరిమిబంధుఁడంచు, యదుకుంజరుఁడంచునువిష్ణుఁడంచుబ
ల్వీరుఁడటంచుగౌరవముజూపుచు, నెత్తినిబెట్టికొంచునా
క్రూరునకింతవాడియగుకొమ్ములుదెచ్చితిరిప్పుడేమ మే
కైరవణించె? ముందువెనుకారయకుండఁగజేయనేమగున్.

దుర్యో—అంగరాజా! గతజలసేతుబంధన మేటికిగాని కర్తవ్యమేమి? చెప్పుము.

కర్ణ—మ. కడుగర్వంబగుకృష్ణుమాటవినిముంకాచెప్పకర్తవ్యమం
చడుగంజొచ్చెదవేమిః సైన్యములతోనాయోధనక్రీడకై
నడువన్మంచిదికాలయాపనమునన్ గార్యంబుగాదేమిపు
ట్టెడినో! లెమ్మికసంధిసంశయముపీడెన్ గాదెభూపాలకా.

ధృత—ధర్మజా! నీయుద్దేశ్యమేమి?

ధర్మ—(విచారించుచు) మీయిష్టమే నాయిష్టము, చివరకు సందేశమిట్లు ఫలించెను గదా! సర్వసిద్ధులముగాక వేరుతెరవేమున్నది. అహా.

భీమ—(రోషముతో) అన్నయ్యా! విచారించెదవేల?

మహాస్రగ్ధర.

గదకేలన్ద్రిప్పుచుఁ భీకరరణవసుధఁ గర్వితారాతులౌనా
యదువీరశ్రేణినింగ్రొర్యమునగదిసియత్యంతభీభత్సమూర్తిఁ
పృథివిఁ రక్తస్రవంతుల్ వెడలిపరువఁగాపిండిగావించినేస
మ్మదమొప్పఁ గెల్తుసుమ్మా! మదివెరువకుమా? ఘూధవుండన్నలెక్కే.

భీష్మ—దుర్యోధనా? మీరలికార్యంబు తెలియంగలుంగక దగిన యేర్పాటులొనర్పకొనక దొందరపడి దురంబున కరుగుట శ్రేయస్కరముగాదు. (ధృతరాష్ట్రింజూచి) వైచిత్రవీర్యా! ఇప్పుడీచతుర్ఘనరక్షణార్థంబు కూడిన మనసైన్యంబులష్టదశాక్షౌహిణీ పరివృతంబై యున్నవి. కృష్ణునితో సమరంబు సేయుటకు మన యోధవీర బృందంబులం దర్జునుండు తక్క నొండొకండింత భారంబు దలపై నిడుకొనజాలఁడు. కావున నీపదునెనిమిది యక్షౌహిణీ బలంబునకును మనయర్జునుని బట్టాభిషిక్తుంజేయుట మేలని నాకుఁదోచెడి. ఆచార్యా! మీయుద్దేశ్యమేమి?

ద్రోణు-సురనదీసంభవా? బాగుగా నాలోచించితివి. అదియే నాయభీష్టము. (తుమ్ముచున్నాడు.)

ధృత—(తుమ్ముచు) అమరనదీ సూనుండు నుడివిన తెరంగు బహుయుక్తి యుక్తముగానున్నది. అట్లుచేయుట నాయభిమతంబు.

అర్జు—భీష్మాచార్యా! జగజేకవీరా? మీకండ్లముందు బుట్టిపెరిగిన పిన్నవాడనగుచున్ను, బెద్దగానానతీయుట తగునా?

క. ధరభారముడుపగానవ
తరణంబై నట్టిజామదగ్న్యునోర్చిదు
స్తరకీర్తిగొనినసీవే
సరిపట్టముగట్టుకొమ్ము? జాహ్నవితనయా!

క. దరణిధనుర్వేదమునకు
గురుఁడై శిష్యుఁడైన నెదురుకొను యోధాగ్రే
సరుఁడగుకుంభజుఁడుండఁగ
జిష్ణునకుబట్టంబుగట్టఁజెల్లునె? చెప్పుమా.

లేకున్న మీరలలో నెవ్వరైన సైన్యాధిపత్యంబు గట్టుకొనుఁడు. మీరును, ముల్లోకంబులును, నన్నుఁబొగడునట్లు శక్తికొలంది కృష్ణునితో బోరెదను.

భీష్మ—(సంతోషముతో) నాయనా! అర్జునా? నీ నీతికుశలతకును, గురుభక్తికిని, శౌర్యసద్గుణ శోభకును, జాలసంతసించితిమి. ఇపుడున్న ద్రోణాది మహారథులు పట్టంబు గట్టుకొనుటకు జాలరని నాయభిప్రాయముకాదు కాని తక్కినరిపులతో సమరంబునకు గడంగుటొక్కవిధము, శ్రీకృష్ణునితో సంగరంబుసేయుట వేరొక్కవిధము. అదియునుంగాక మేము ముసలివాండ్ర మైతిమి. అస్త్రబలంబునకేమి కాని దేహబలంబు నశించినది. నీకారెండు బలంబులు సమానంబుగాగలవు. కావున

చ. తగుదువునీవుశ్రీహరినిదారుణసంగరమందెదుర్కొనన్
దగుదువుతోడులేకబలదర్పముతోనెదురొడ్డినిల్వఁగా
దగుదువుశౌర్యవహ్నులనుదగ్రతలోకములెల్లగెల్వఁగా
దగుదువునీకుబోల్పగలధైర్యసమగ్రులులేరుఫల్గునా!

నీపిరుందన ధర్మసంభవ, దుర్యోధన, దుశ్శాసన, శకుని, సైంధవ, విరాట, ద్రుపద, దుష్టకేతు, ఘటోత్కచ, విందా, నువింద, నీల, సుదక్షిణ, పాండ్య, రుక్మి, భగదత్త, కేకయులును, గూడ బదునైనమండ్రు, యక్షౌహిణీపతులయ్యెదరు. వీరలును, నేను, ద్రోణుండు, కృపుఁడు, శ్వత్థామ, కర్ణ, బాహ్లిక, సోమదత్త, భూరిశ్రవులుండక్కిన యోధాగ్రేసరులును, రణరంగంబున నీవుచెప్పిన చొప్పున సంచరించుచు, రణకేళి నొనర్చెదము. నీవు మాపలుకులు కెదురాడక సర్వజన సమ్మతంబగుసేనాధిపత్యంబునకు బట్టంబుగట్టుకొమ్ము.

అర్జు—భీష్మద్రోణాది మహారథశ్రేష్ఠులారా! మీమాటకెదురాడ నెంతవాడను. మీరలందఱు నన్నింత పెద్దసేయ హరినేగాదు, పురహరుంగూడ గెల్చెదను.

కర్ణు—(తుమ్ముచున్నాడు.)

అర్జు—కానినాకునుంచిసారథియు, జక్రరక్షకులును, మహాయోధులు కావలయును.

భీష్మ—ద్రోణాచార్యా! మనలోదగిన వారెవ్వరుకలరు?

ద్రోణు-గంగానందనా! అర్జునునకు సారథిగానుండుటకు శల్యుండుతప్ప వేఱొక్కరుండు లేడు. ఉత్తమౌజయుధామన్యుల జక్రరక్షకులుగా నుంచుట కడుశ్రేయస్కరము.

భీష్మ—(సంతోషముతో) ఆచార్యా! నీబుద్ధికుశలత్వంబు జాలమెచ్చవచ్చెడి.

భీష్మ—అట్లయిన జాలమేల? తిథివారనక్షత్ర బలంబుల జూడుము.

ద్రోణు-(ఆలోచించుచు) అమరనదీపుత్రా! అన్నియు బాగుగానున్నవి. అభిజిన్ముహూర్తంబు జరుగుచున్నది. ఇంక పదిగడియలకుగాని వర్జంబులేదు. ఇప్పుడే యర్జునుని సింహాసనాసీనుం జేయుండు.

(మంగళధ్వనులు చెలంగుచున్నవి. భూసురులాశీర్వచనంబు లిచ్చుచున్నారు.)

భీష్మ—అర్జునా! ఈసింహాసనంబున గూర్చుండుము.

(బ్రాహ్మణులు తుమ్ముచున్నారు.)

అర్జు—(కూర్చుండుచున్నాడు.)

(నక్కలార్పులు వినంబడుచున్నవి. దుశ్శకునంబులు తోచుచున్నవి.)

భీష్మ—(తుమ్ముచు గిరీటంబు శిరంబునబెట్టి.)

ఉ. బాలక! సర్వశాత్రవులభండనభూమిని గెల్వ, ధర్మముల్
బాలనసేయ, గీర్తివిభవంబు త్రిలోకము లెల్లనింప, భూ
పాలురమేచ్చవై, బలముపౌరుషశౌర్యములుం జెలంగ, జే
జేలుమనంబులన్ ముదము జెందఁగ, నాహవభారమూనుమా.

(అందఱు నక్షతలు చల్లుచున్నారు.)

ద్రోణు.(ఆలోచించుచు) గంగానందనా! దుశ్శకునంబులు దోచుచున్నవి. తత్పరిహారార్థంబు బ్రాహ్మణులకు దానంబులు సల్పుట లెస్స.

శ్వేష్ట్ర—మంచిది.

(అని బ్రాహ్మణులకు హిరణ్యగోభూదానంబు లిచ్చుచున్నాఁడు.)

ద్రోణు-కౌరవనాథా? ఆలస్యముసేయుటేల? మనపదునెన్మిది యక్షౌహిణుల బలంబు నీరోజుననే శమంతక పంచకంబునకు బోవనియమించి తగిన గుడారంబులు నిర్మింప సేవకులకనుజ్ఞయిచ్చి పయనంబుసేసి పంపుము. మనముకూడ నీరేయిబయలు దేరుదము.

శ్వేష్ట్ర—మంచిది. శ్రీకృష్ణుఁడు ద్వారకాపురినుండి, సర్వయాదవ సైన్యంబులతో శమంతక పంచకంబునకు వచ్చుచున్నట్లు చారులవలన దెలియవచ్చినది కావున, రేపటిదినంబున యుద్ధంబు ప్రారంభింతము.

ధృత—మంచిది. ఆట్లనే సేయుడు. నేఁటికి కొల్వుచాలింతము.

(అందఱునిష్క్రమించుచున్నారు.)

## చతుర్థాంకము సంపూర్ణము.

శ్రీగురుభ్యోనమః

# విచిత్ర భారతము.



## పంచమాంకము - ప్రథమరంగము.

శమంతకపంచకము. యుద్ధభూమి.

(హరిస్మరణసేయుచు నారదుఁడు ప్రవేశించి.)

నారదు-(నవ్వుచు) నేడునాకుగన్నులపండువగా నున్నది. నాకుఁగడుపునిండ నాహారంబు కల్గినది. నిష్కారణంబుగ శ్రీకృష్ణునకును, కౌరవ పాండవులకును, ఘోర యుద్ధంబు కల్పించితిని. వారందఱు లోకంబులు తల్లడిల్ల వెనుదీయక బోరుచున్నారు. నాతలంపీడేరినది. నాపేరు సార్థకముజేసితిని.

దుశ్శా-(ప్రవేశించి) ఎవరువారు?

నార—దుశ్శాసనా! నేను నారదుఁడను.

దుశ్శా-కలహప్రియా! మీరా? (అనివగర్చుచున్నాడు.)

నార—దుశ్శాసనా! నీవిట్లు వగర్చుచు బరువెత్తి వచ్చుటకుఁ గతంబేమి? దేహమెల్లెడల రక్తధారలు నిండుటకుఁ గారణంబేమి? సంగరవృత్తాంతము దెల్పుము. వినవేడుకగుచున్నది.

దుశ్శా-(విచారముతో) సురమునిపుంగవా! ఏమిచెప్పుదును. యాదవవీరులం దలంచికొనిన గుండెఝల్లుమనుచున్నది. పాంచజన్యం బొత్తుచు, శైబ్యసుగ్రీవ మేఘపుష్పక వలహకాలంకృతంబగు తేరెక్కి శ్రీకృష్ణుండును, లోకంబులజీకాకు పరచుచు బలరాముండును, విరోధికానన దవానలుండై సాత్యకియును, వైరిచుల గోత్రదంభోళియై ప్రద్యుమ్నుండును, బాణమండలి రణంబునంగప్పుచు ననిరుద్ధుండును, భువనంబుల మ్రింగుతెఱంగున జారుదేష్ణుండును, వైరివీరుల పాలిమారి చాడ్పున సాంబుండును, యుగ్రుండై యుగ్రసేనుండును, ప్రళయాంతకాకృతి నక్రూరుండును, యరుణుడు, కృతవర్మ, యంగదుండు, గదుండు, చేకితానుఁడు, పుష్కరుఁడు, శుకుఁడు, దీప్తిమంతుఁడు, భానుదేవుఁడు, సారణుఁడు, శివదేవుఁడు, వసూథి, చిత్రబర్హియాదిగాఁగలయో

ధులు వివిధాయుధంబులతోఁ సంకులసమరంబుగావించుచుండిరి. వియచ్చరుల చ్చేరువంద భారతయోధులందరు మొగ్గరంబులఁజున్నచు గార్చిచ్చులవోలెనైని రిబలంబు పైగవిసె. పరస్పర జయకాంక్షల బోరుచున్నారు. ఇరువాగుసైన్యంబులు బీసుగు పెంటలై యున్నది. నాకు రణంబునకేగ శెలవిమ్ము. (నిష్క్రమించుచున్నాడు.)

నార—మంచిది. నేడునాకు గన్నులపండువుగానున్నది. కృష్ణార్జునుల చెంతకేగినగాని తృప్తికలుగదు. (నిష్క్రమించుచున్నాడు.)

(ధర్మరాజు ప్రవేశించుచున్నాడు.)

ధర్మ—(విచారముతో) అహా! దైవమా! ఎట్టివైపరీత్యంబులుపుట్టె? పదునెనిమిది యక్షౌహిణుల బలంబు రూపుమాసె. ఇంకను గన్నెత్తిచూచుటకైన వశంబు గాక యాదవవీరులుక్కుమిగిలి పోరుచున్నారు. అర్జునుండెచ్చట నెవ్వరితో సంగరంబునకుఁ గడంగెనో తెలియకున్నది. మమ్మింతవరకు దెచ్చిన శరణార్థి గతియేమాయెనో కదా? భీముని సంగతి గోచరంబుకాదు. చిన్నికుఱ్ఱలగు కవలేమైరోయని భీతికలుగుచున్నది. భీష్మాది కౌరవయోధు లెచ్చటనున్నారో! సూర్యాస్తమయంబు కాబోవుచున్నది. జయసూచకంబులు కానరాకున్నవి. అహా!

(దుర్యోధన, దుశ్శాసన, భీష్మ, ద్రోణ, కృపా, శ్వాద్థామ, కర్ణులు ప్రవేశించుచున్నారు.)

ధర్మ—(అందరినిఁ గౌగలించుకొని) మహాత్ములారా! సుఖంబుగనుంటిరా?

భీష్మ—ధర్మసంభవా! చింతిలకుము. సురక్షితముగా నుంటిమి. చక్షుర్థనుఁ డేమయ్యెను!

ధర్మ—పితామహా! (విచారముతో) ఆతనిజాడ తెలియలేదు. ఇప్పుడతనిజాడఁజూడకుండనిల్చుటకు మనంబొప్పకున్నది. కవలతో నాతనిఁగూడ తోడ్కొని వచ్చెద. (నిష్క్రమించుచున్నాడు.)

(భీమ, నకుల, సహదేవులు ప్రవేశించుచున్నారు.)

భీష్మ—(కౌఁగలించుకొని) నాయనలారా! సురక్షితముగా నుంటిరా? మీకొఱకై ధర్మజుఁడు, ఒగులువడుచు మిమ్మువెదుకబోయెను.

భీము—తాతాగారూ? అజాతశత్రుండేమగునోకదా!

భీష్మ—భీతిల్లకుఁడు. ఆతని నెవ్వరు గన్నెత్తిచూడరు. ద్రోణాదులారా! చూచితిరా! కృష్ణార్జును లెట్లు వెనుకదీయక పోరుచు జారివచ్చుచున్నారో? మనముమా రంబుగానుండి వీరిశరకౌశలంబును, బలాబలంబులను, జూచుచు నిచ్చట కొంతసేపలయిక దీర్చికొందము.

(కృష్ణుఁడు పరుగిడుచు వచ్చి కోపముతో)

కృష్ణ—అర్జునా! నిలు. నిలు. ఎచ్చటికేగెదవు?

(వెనుక చతుర్థనునిం బెట్టుకొని యర్జునుఁడు పరుగిడుచువచ్చి కోపముతో)

అర్జు—కృష్ణా! నిలు. నిలు. ఎందరెగెదవు?

కృష్ణ—(కోపములో చతుర్ధనునింజూపుచు.)

క. వినుపదు నెన్మిదియక్షౌ
హిణులెల్లనుస్వర్గమునకు నేగెనుననునీ
వనిగెల్వ లేవు చెడకుము
విను? విను! నామాట. వీనివిడువుముపార్థా.

అర్జు—ఉ. చాలునుసర్వసైన్యములు జచ్చినజావఁగనిమ్ము, కౌరవుల్
కూలినఁగూలనిమ్ము, ధరగ్రుంగినగ్రుంగగనిమ్ము, బంధువుల్
వ్రాలినవ్రాలనిమ్ము, నుజవర్గముపోయినబోవనిమ్ము, భూ
పాలునివీడగంతమునబ్రాణములుండినకాలమంతయున్.

మ. అనుజుల్ కూలినగంటనీరిడను, సైన్యశ్రేణియంతంబునొం
దినదుఃఖింపను, పుత్రబంధుజనులార్తింజెందశోకింప, సీ
క్షణభంగంబగుమేనికాసపడిజంకన్, జల్లకున్వచ్చిముం
తనుచేదాఁచఁగనేల? జెప్పితియదార్థంబింతె, దామోదరా.

శరణాగతునివిడువుమనుట మీవంటివారనరానిది, మావంటివారు వినరానిది. పెక్కుమాటలేల?

కృష్ణ—అట్లనా! మదీయశరాసారంబింతవరకెఱింగితివా లేదా! ఇంకనుగరువంబడఁగలేదా!

అర్జు—(నవ్వుచు) కృష్ణా! ఏమది?

మ. ఇపుడేకాదొకో? తేరుమూలబడిపోయెన్, బట్టపగ్గాలులే
కిపుడేగుఱ్ఱములెల్లబర్విడియె, మేనెల్లన్ శ్రమంబందె, జే
యిపుడేవంగెను, వెన్నుఖూట్లువడె, చాలింకేల? పైయెత్తులీ
విపుడేమర్చితిపార్థబాణములు, నీకిట్లాడనోరాడెనా.

కృష్ణు—(కోపముతో) అర్జునా!

గీ. పెరుగుఁబాలునుబడబోసిపిల్లికూన
గడిఁదిపెంపనుఁబెంపంగగండుమీఱి
కూటికుండకుఁజేటునుగోరినట్టు
లయ్యో! సుమ! నీదువర్తనంబంత్యమునకు.

అన్నివిషయంబులయందును సహాయుఁడనై, చిన్నతనంబునుండియు, నీకు మేలొనగూర్చుచు, నెత్తిపై నెక్కించుకొన్నందుకు బాగుగా జేసితివి? నిన్ననేల! నాదే పొరఁబాటు.

అర్జు—(హేళనాపూర్వకముగా)

ఉ. పాపమునీసహాయములవల్లనె? పేరుప్రతిష్ఠగాంచితిన్
బాపమునీయనుగ్రహమువల్లనె? కూడునుగుడ్డచేపడెన్
బాపమునీకృపామహిమవల్లనె? వైరులగెల్చితాజులన్
బాపమునీవుపుట్టుటనుబట్టియెనిల్చితినే? లేక, నిల్తునే?

నేనేఁటి పౌరుషవంతుఁడను? నేనేఁటి శౌర్యవంతుఁడను? నీవులేకున్ననాఁడు గవ్వలె నీపాటికి గాజులదొడిగించుకొని యింటఁగూర్చొననా!

కృష్ణు—గీ. ధరగృతఘ్నునిహితునిగాదలఁచినమ్మి
యెట్టియుపకారములసేయ, నెన్నిపాట్లు
పడిన, నిబ్బందులనునడ్డుబడిన, దుదకు,
బూడిదెనుబోయుపన్నిటిపోల్కెనగును.

అర్జు—(కోపముతో) మురాంతకా! నీవు నాకొనర్చిన యుపకారము వేలుమడచి యొక్కటి చెప్పుము.

సీ. ద్రోణునకై మున్ను ద్రుపదు దెచ్చుటజూడ
నీచేతఁగాబోలు నీరజాక్ష!
మనుజేశులనుద్రోలి మత్స్యయంత్రము ద్రుంప
నీచేతఁగాబోలు నీరజాక్ష!
వరద్రౌపదినిస్వయంవరమునఁ బెండ్లాడ
నీచేతఁగాబోలు నీరజాక్ష!
ద్రౌపతికోఱకు సైంధవుబట్టి గెల్చుట
నీచేతఁగాబోలు నీరజాక్ష!

గీ. మీకు గొండంత జేసితి మేలు, బల్కు క్రి
తఘ్నులు కృతఘ్నులని దెప్పదగిన నీదు
పలుకులు విన మెరపగంధమలదినట్టు
లకటమండెడి దేహమర్జునాక్ష యిపుడు.

కృష్ణు—(కోపములో) కిరీటీ! ఎంతటి మిత్రులకైన, నెట్టిబాంధవులకైన, విరోధంబు లుసంప్రాప్తమైనప్పుడు చేసిన మేళ్లు కీడులగును. ప్రేమలడుగంటును. ఇది లోకస్వభావము. చేసిన మేళ్లు విరోధంబు వచ్చినప్పుడు దెప్పుట నావంటివానికి లక్షణముకాదుగాని యాలోచించుకొన నీకే తెలియగలవు.

అర్జు—(కోపములో) మాధవా! విరోధంబు వచ్చినప్పుడిట్లడుగుట నావంటివానికిం గూడదుగాని, నేనడుగుచుంటిని నీవు చెప్పుము.

కృష్ణు—అట్లనా?

ఉ. సాటికొలంబు నవ్వ, సహజన్ముఁడువద్దనిపట్టుబట్టగా
గూటికి గుడ్డకుం గొదవగూడినవానికి బిల్లనిచ్చి, ము
ప్పూటలు మేపి, రవ్వబడి భూపతులందరికిన్విరోధివై,
పాటిలి తప్పుజేసి, దుదివందురినర్ఘ భలమేమి? ఫల్గుణా!

అర్జు—(నవ్వుచు) సాటివారు నవ్వుటకు కులహీనుఁడును గాను. మనమిద్దరము మేనత్తమేనమామబిడ్డలము గదా. అదియునుంగాక నిజగదా! నీవు చేసిన మేలు? ఇంతమక్కై విచారించుచుంటివా! ఏమి దెప్పదెప్పితివి?

ఉ. మేనరికంబుతప్పుటకుమీరుసహోదరినివ్వకుండిన
న్మానముసేయకుండిననునాకికబెండిలికాకయున్నె! నీ
వేననుకూడుగుడ్డనిడియిన్నిదినంబులుబెంచినావుసి
గ్గైననులేదె! మోమునకునచ్యుత! యేమనిదెప్పెదిత్తరిన్.

నీసంబంధము జేసికొని నేను బావుకొనినదేమి?

కృష్ణు—ఇంకేమికావలెను?

అర్జు—కావలసినవేమున్నవి? దేనియందైన గొఱంతనుంచితిరా! పెండ్లివాడు మీ రిచ్చిన కట్నములేమి? మీరిచ్చిన యూళ్లేమి? మీరిచ్చిన కట్టువర్గములేమి! ఒక్కటియా? అచ్చటముచ్చటలన్నియుం దీరినవి. నేఁటితో మిగిలినవన్నియుఁ దీరుచున్నవి.

కృష్ణు—ఇంకనూళ్లును, రాజ్యధనంబులేల? అన్నిఁటికిని సరియైన పదునారేడులబంగారు బొమ్మను నీకు ధారపోసితిని. చాలదా?

అర్జు—మీబంగారుబొమ్మ, మీరత్నాలతుప్ప, నట్టింట నిప్పచ్చిపాదమెప్పుడు పెట్టినదో యప్పటి నుండియు, సర్వస్వమును బోరంగి యమ్మబువ్వ, నాయనా బువ్వ, యనియడవుల పాలైతిమి. తక్కినసంబంధంబుల చేసికొనిన బాగుపడియుందుమేమొ!

కృష్ణు—అర్జునా!

గీ. ఎట్టిమంచిసంబంధంబులెంచికొనిన
క్ష్మాపతులునవ్వఁగాపౌరుషములువీడి
సిగ్గులజ్జయునువిడచిచెలఁగుచుండు
జూదరులుబాగుపడుదురే! మోదమెసఁగ.

అర్జు—శ్రీకృష్ణా!

సీ. ఎట్టిసంబంధంబులెంచినదల్లిప్పు
ట్టింటికినేడ్పుపుట్టింపగలమె?
పౌరుషంబులుగల్గబరిపంధికాజిలో
వీగిపారిగుహాళిడాగగలమె?

సిగ్గుగల్గినగొల్లచేడెలువిడచిన
బట్టపాతలుచేతముట్టగలమె?
లజ్జయుండినగన్నులకుగనంబడుగొల్ల
యతివతోసరసంబులాడగలమె?

గీ. యట్టిమంచిగుణంబులెట్లమరగల్గు
బాంధవులచేతగొప్పలెబ్బంగివచ్చు
నరయమాబోంట్లబావమరదులాల
కాపరులుగల్గబాగెట్లుగాంతురనఘ.

కృష్ణు—(కోపముతో) చాలు. చాలు. నాకుబాంధవుఁడ వగుట చేతనే నీగాండీవంబున కు వన్నెగల్గినది. బాగుగాదలంచికొనుము.

అర్జు—(నవ్వుచు) కూపస్తమండూకంబు క్రియనిట్లను కొనుచున్నావుకాని లోక వదంతివినలేదు. మొన్న కౌరవసభలో కర్ణుండాడిన మాటలు విననీవిట్లనవు. నేనిప్పుడనుటెందుకు.

కృష్ణు—(కోపముతో) పోనీ! ఏమనెనో చెప్పుము.

అర్జు—ఏమనెనా! అర్జునిచేత కృష్ణునకు నామంబు బయలువడెనుకాని యాతని పేరు నూరునెవ్వరెరుంగుదురనె.

కృష్ణు—(కోపముతో) అట్లనా! దొడ్డెలు గేదెలు దొంగలు తోలుకొనిపోవ గొడ్డు గేడె శివాలక్ష్మియయ్యె నన్నట్లు చివరకు కర్ణుఁడా నీకు గొప్పవాఁడయ్యెను. ఆతనిమాటలా? నీకునిఘంటులయ్యెను? అందుచేతనా నన్నుగెల్తునని గర్వంబు బూనితివి! కృతఘ్నా? మిత్రద్రోహా? నీవెక్కడో? నేనెక్కడో? ఇప్పుడే కనపడును. (శరంబుదొడఁగి)

మత్తకోకిల.—

పార్థయెచ్చటికేగువాడవపారమౌగరుఁడాస్త్రముక్
స్పర్థతోనిపుడేయుచుంటినిపారిపోవకనిల్వుమా?

అర్జు—దేవకీనందనా!

" వ్యర్థవాక్యములేల? మీకలవాటుభీతినిబారిపా
కార్థమైకుహూలందుడాగుటలంబుధిన్వసియించుటల్.

ఇదిగో ఐంద్రాస్త్రంబునదాని ముత్తినియలు గావించెద. (శరంబుతొడుగుచున్నాడు.)

కృష్ణు—ఇదిగో కాచికొమ్ము. (గరుడాస్త్రంబేయుచున్నాడు.)

అర్జు—ఇదిగో కాచికొమ్ము. (ఐంద్రాస్త్రంబున ద్రుంచుచున్నాడు.)

కృష్ణు—(కోపముతో) నాశరంబు ఖండించితినని సంతసించకుము. ఈరౌద్రాస్త్రంబు గాచికొనుము. (శరంబువొడఁగి.)

మత్తకోకిల.—

తాళజాలవునాశరంబునుదర్పమొప్పఁగవై చినన్
గాలుచెంతకునేగదప్పదుకాచికొమ్ముధనంజయా.

అర్జు—(కోపముతో)

చాలుచాలునునీశరంబునుజక్కఁగానిటద్రుంచెదన్
లీలబాశుపతంబుచేనవలీల దేవకీనందనా!

కృష్ణు—(శరంబువదలుచున్నాడు.)

అర్జు—(ద్రుంచుచున్నాడు.)

కృష్ణు—(కోపముతో బ్రహ్మాస్త్రమందుకొని)

తరళవృత్తము.—

వినుమవినుమాన్ను వునివీడుమబీరమొప్పదుసుమ్మనే,
ఘనముగాబ్రహ్మాస్త్రమేసియుగార్యమొప్పగఁగూల్చెదన్.

అర్జు—(కోపముతో)

" మనుజనాథునివీడ? వీడనుమాధవా? బ్రహ్మాస్త్రముచ్
దునిమినిన్నునిగూల్చినేనునుద్రుంచెదన్ రణభూమిలో.

కృష్ణు—(కోపముతో) పార్థా! త్రిలోకభీకరంబగు బ్రహ్మాస్త్రంబు ప్రయోగించుచున్నాడను. చిరకాల స్నేహమువీటిబుచ్చకుము. నాకపకారియగు చతుర్థునిని విడచిపెట్టుము. విడచిపెట్టుము.

అర్జు—కృష్ణా! మనమైత్రిని జేతులార నీవేసెటగల్పుచుంటివి? శరణార్థియగు చతుర్థునని విడువనని యిదివరకే చెప్పితిని.

చతు—(వడవడవడంకుచు) మహాత్మా? యర్జునా! నన్నుగాపాడుటకిదే సమయము. ఆపద్బాంధవా! రక్షింపుము.

అర్జు—చతుర్ధనా? నావెనుకనుండి బయటికి రాకుము. నీకేమియు భయములేదు. నీలో, నీవేగజిబిజిపడి, తల్లడపడి, భయపడి, కలుగుడువడి, వెరగుబడి, తపజడి, కృష్ణుకాళ్ళలోబడక నాచాటునడాగియుండుము. నన్నువిడచితివేనిబ్రతుకనిశ్చయముసుమా.

కృష్ణు—(తనలోవిచారించుచు) అకటా? పార్థా! చేతులారనిన్నెటుల నీబ్రహ్మాస్త్రంబు పాలుసేయుదును. (విచారించుచు నాలోచించుచున్నాడు.)

అర్జు—శ్రీకృష్ణా! సర్వసిద్ధంబుగానుంటిని. నీయస్త్రంబు బ్రయోగింపుము. ఆలోచింపెదవేల?

కృష్ణు—(విచారముతో) అర్జునా!

ఉ. పుట్టినవారిలోనడుమముద్దులుముచ్చటమీరనొక్కతో
బుట్టువపుట్టిపార్వతినిబోలుచునిండజెలంగదానికీ
పట్టెడుబొట్టునుంబసుపుబాఁపగచేతులురాఁకనాకడం
గొట్టుసుభద్రగొంతుకనుగోయఁగలేకతలంచుచుంటిదన్.

కానిమ్ము. రాజులకు సమరంబాదవినప్పుడు బంధుత్వంబులాగునా? ఇదే మదీయాస్త్రంబు గాచికొమ్ము.

అర్జు—(బ్రహ్మాస్త్రమందికొనితలయూచుచు విచారించుచున్నాడు.)

కృష్ణు—పార్థా! పార్థా? ఇప్పుడు పశ్చాత్తాపపడి యాలోచింపఁగనేమున్నది!

అర్జు—శ్రీకృష్ణా! (విచారములో)

చ. ప్రకటితప్రేమసోదరునిభంగిగఁజూచుపదారువేలగో
పికలకునొక్కమాటఁతలపెంపుచెడుంగద? వన్నెఁగాంచునీ
దుకులము రాజహీనమయిదుఃఖసముద్రముజొచ్చునంచునే
వికలమనస్కుఁనైచపలవించుచుజేతులురాకయుంటిరికన్.

సర్వసిద్ధుఁడనై యుంటిని. ఇఁక నీబ్రహ్మాస్త్రంబు బ్రయోగింపుము.

కృష్ణ—(కోపముతో) అర్జునా! ఇఁకనిన్ను విడువఁజనదు.

శా. ముల్లోకంబులడాగినన్ ద్రుహిణశంభుల్గాచినన్ భీతితో
నుల్లోలార్ణవమందు గ్రుంకినను పుర్హూతుండుతోడైనదా
నుల్లంఘింపక నాశరంబిపుడు దివ్యాస్త్రచ్ఛగానీతలన్
జెల్లంజేయుద్రిశుద్ధిగా మనమునన్ జింతింపుమా! శ్రీహరీ.

అర్జు—(కోపముతో నవ్వుచు)

ఉ. తారలువ్రాలలేదు, హిమధాముఁడు వేడిమిఁజూపలేదు, ది
గ్వారముకూలలేదు, దిగిభంబులు మ్రొగ్గగలేదు, సూర్యసం
చారముమాయలేదు, భువిజంకగలేదెటు? పార్థుశీర్షమీ
ధారుణిజేరు! మాటలకు తాళఫలంబులువ్రాలునా! హరీ.

బలాబలంబులు శౌర్యాశౌర్యంబులు మనయధీనంబులు జయాపజయంబులు దైవాధీనంబులు. ఇదే నేనుఁగూడ బ్రహ్మాస్త్రంబు ప్రయోగించుచున్నాడను. కాచికొమ్ము.

కృష్ణ—(కోపముతో) పార్థా! పార్థా! చచ్చిపోతివి? (అని బ్రహ్మాస్త్రంబు ప్రయోగించుచున్నాడు.)

అర్జు—(కోపముతో) కృష్ణా! కృష్ణా! పొలిసితివి? పొలిసితివి? (అని బ్రహ్మాస్త్రంబు ప్రయోగించుచున్నాడు.)

కృష్ణ—(ఆకాశమువంక జూచుచు దనలో) ఆహా! మాయిరువురి బ్రహ్మాస్త్రంబులు గలసి, భగ్గుభగ్గున మండుచు, త్రిలోకంబులం గలంచి తుదకొకటి నొకటి జయింపలేక శాంతివహించెను. ఇదివరలో పార్థునిచే విడువంబడిన శరంబులు నామేననాటి యింకను, నలయించుచున్నవి. ఆహా! ఇంతటి మహాశూరుండీ ముల్లోకంబులలేడు. ఇంకబుట్టడు. ఈతనికీతఁడేసాటి, ప్రాణమిత్రుండును బాంధవుండునగు నన్నైన విడువనెంచెనుగాని శరణాగతుని విడచినవాఁడుకాఁడు. ఇంక నేయస్త్రంబులైన, నీతనియెడ ననాదరణంబులు. కావున జక్రంబుప్రార్థించి, నాప్రతిజ్ఞ నిలుపుకొనెదఁగాక! (కోపముతో నాకాశము వైపు జూచి)

శా. శక్రేశానవిరించనుల్వొగడభీష్మార్చిప్రభల్మీరగా
శుక్రాచార్యప్రశిష్యకంఠరుధిరక్షోణీయుతాఖీలసి
ర్వక్రస్ఫూర్తి జెలంగి వైరులనుసంగ్రామోర్విలోఁగూల్పనో
చక్రంబా! చనుదెంచినిల్వుమిఁక హస్తంబందు దేజంబుతోన్.

(మంటలుగ్రమ్ముచు చక్రము శ్రీకృష్ణునిచేతిలో నిలచుచున్నది.)

అర్జు—(తనలో) ఆహా! లోకంబుల మలమలమాడ్చుచు, జ్వాజ్వల్యమానంబయి, విప్పులఁగ్రక్కుచు, భయావహంబుగా, చక్రంబు శ్రీకృష్ణుని చేతనిల్చినది. (చతుర్థునింజూచి విచారముతో) రాజా! నేటితోనీకును నాకును ఋణంబుతీరినది కాబోలు. నిన్నుంగాపాడలేక పోయిన నాప్రతిజ్ఞ తప్పక జరుఁగునుగాత! అయినను నీవు నావెనుకనే యుండుము. (కృష్ణుంజూచి కోపముతో)

శా. నీచక్రంబును, నిన్ను, నీబలమునున్ నీపెంపు, నీశౌర్యమీ
భూచక్రంబున నేనెఱుంగనొకో? దివ్యాస్త్రెచ్చగాఁద్రుంచగా!
నీచుండౌదనుజుండగాను మదిచింతింపంగ సత్కీర్తి ద్రో
ణాచార్యాద్భుతశిష్యుఁడన్ భయపడన్ రానిమ్ము నారాయణా!

మఱియు కృష్ణా!

మ. జననంబైనసమస్తజీవులకు వాస్తవ్యంబుగా జావుపు
ట్టినదేవెంట, దధీచిముఖ్యులిలనుట్టింగట్టిపై నూగిరే
చనకన్ భీతునిగావక్షత్రివడుదాచంద్రార్కమున్ నీదు చే
తనుబ్రాణంబులుపోవస్వర్గమకరున్ ధన్యుండ నెబ్భంగినిన్.

నేనుఁగూడ బాశుపతంబునంది సిద్ధంబుగానున్నాడను.

కృష్ణు—(కోపముతో జక్రంబుంజూచి)

గీ. తివిరివసుదేవ దేవకీ దేవులకును
యదుకులంబున నేజన్మమెతినేని
యాడితప్పనివాడనై యలరుదేని
చక్రమా! నాప్రతిజ్ఞనుజరుపుమిపుడు.

నీకు ద్రిలోకంబులనడ్డులేదు. కావున ధర్మరాజునొక్కనివిడచి కౌరవులను, భీష్మాదివీరులను, జతుర్థనుతోఁగూడ నీయర్జునుని ద్రుంచివేయుము. (వదలుచున్నాడు.)

(భీష్మ ద్రోణ కృపాశ్వత్థామ దుర్యోధన కర్ణ భీమార్జున చతుర్థన నకుల సహదేవులు కూలుచున్నారు.)

(కృష్ణుఁడు నిష్క్రమించుచున్నాడు.)

(దుఃఖించుచు ధర్మరాజు ప్రవేశించుచున్నాడు.)

ధర్మ.—అయ్యో! అయ్యో? ప్రళయకాల ప్రచండమార్తాండ బింబంబువిడంబించుచుమండుచు, దుర్వారదుర్నిరీక్ష్యంబై, సైన్యంబులనురుమాడి చక్రమా హరిచేతి కెక్కుబోవుచున్నదో? కృష్ణుండు తనప్రతిజ్ఞ నీడేర్చుకొనెను కాబోలు! లేకున్న చక్రంబేల మరలిపోవును? (తేరిచూచి) అయ్యో! ఇంకేమున్నది? భీష్మాదివీరులెచ్చటను గనంబడకున్నారు. భీమార్జునులేమైరో? ఎచ్చటఁజూచినను బీనుంగుపెంటలేగాని యెవ్వరును నిలచియున్నట్లు తోచదు. పదునెన్మిది యక్షౌహిణులలో నొక్కఁడనే బ్రతికియున్నట్లు తోచుచున్నది! హాబంధువులారా! హామిత్రులారా! హాసోదరులారా? హా కుమారులారా! ఏమయితిరి? ఎచ్చటనుంటిరి. ఒకరైనగాన్పించరేమి?

గీ. అక్కటానక్కలార్పు మెండయ్యె? గ్రుడ్ల
గూబలరచెడి? బత్తులుఁగూయజొచ్చె
చావులకునోడుగా సంధ్యసమయ మొదవె
దిక్కుమాలినచీకటి దిశలనిండె.

(చూచుచు) ఆహా! ఆభూత జాలంబులెట్లు వీరవరుల రక్తప్రవాహంబుల నెంత సంతసంబుగా జలక్రీడల దేలుచున్నవో? ఆభూతంబులెట్లు మాంసపుంబెట్టెలదెచ్చి తక్కిన భూతంబులకు విందుసేయుచున్నవో! పడిపోయినవీరుల కరవాలంబుల గేలందాల్చి భయంకరంబుగా నాభూతంబులెట్లు వీరవిహారంబు సల్పుచున్నవో? అయ్యో! దైవమా? నేనుచూడ జాలకున్నాను. నేనెందుకు బ్రతికితిని. నాకెందుకు చావురాకున్నయది? ఎట్లైనను సమరతలంబున దీర్ఘనిద్రవలం జొక్కువారి నందరజూచి, మరియుఁ జచ్చెదగాక? అయ్యో? క్రమముగా గాఢాంధకారంబు దిశలఁగ్రమ్ముచున్నదే? ఏమి వెలవు? (చూచి) అస్త్రవహ్నినిమండుచున్న యీరథంబు కడకేఁగి కరదీపికనొకటిం గల్పించుకొని తత్సహాయంబున రణభూమిగలయఁజూచె

దగాక! (అనికరదీపికం గొని) హా? దైవమా! దైవమా? (వెదకుచుబోయి భీష్ము నిమృతకళేబరంబుం గాంచి) హా! భీష్మాచార్యా! అమరనదీనందనా! తాతా! (పైఁబడి దుఃఖించుచు.)

సీ. దురమున నెదురొడ్డి పరశురామునినోర్చు
బలమెట్లు గంగలోఁ గలసిపోయె
నమరులద్భుతమునంద సమానశస్త్రాస్త్ర
బలమెట్లు నిస్వీడి తోలఁగిపోయె
ధారుణిజగదేకవీరకీర్తిని గన్న
బలమెట్లు గడియలోఁ బొలిసిపోయె
స్వచ్ఛందమరణంబు జరుపు శంతనువర
బలమెట్లు మంటిలోఁ మలఁగిపోయె

గీ. చేరి మాటాడవేమి? సర్కు జేరవేమి?
మించుకృపతోడ నన్నాదరించవేమి?
వంచనము జేసితనికోపగించినావ
పిల్చిన నుబల్కవేమి? నాభీష్మ తాత!

పాండురాజు మమ్ము విడచి పోయినదాది నిన్నే చూచుకొని బ్రతుకుచుంటిని, ఇఁక నేనెవ్వరిఁ జూచి కష్టసుఖంబుల జెప్పుచుందును! ఇఁక నెవ్వరితోడ జీటికిమాటికి నాలోచనగావింతును. హా! సురనదీసుతా! హా భువనైకధనుర్ధరా? హా! పితృవాక్యపరిపాలనా! హా! అస్ఖలితబ్రహ్మచర్యాశ్రమవాసీ? హా ధీవిజితసురాచార్యా భీష్మాచార్యా! తాతా! నేటితో గంగాదేవి నపుత్రవతిగా జేసితివా (లేచి దుఃఖించుచు గరదీపికచే వెదకుచుబోయి ద్రోణాచార్యునిం జూచి పైఁబడి) హా? ద్రోణాచార్యా? గురువరా? చాపగురూ? త్రిభువననిర్జితబలా? దేవేంద్ర సంస్తుత శరవిద్యాప్రవీణా?

మ. స్ఫురదస్త్రంబుల కాదిపీఠమయి దివ్యత్వమెచ్చు నీశౌర్యసా
గరమేరీతిగ నింకె! నీబలము నీకయ్యంపు పాండిత్యమెం
దరిగెన్ జూడ త్రిమూర్తులన్ వెరగుబొందం జేయు, నీదేహమే
కరణిన్ ఘూర్ణిల్లెఁ బ్రుంగె? ద్రోణగురు? విఖ్యాతప్రభావోదయా,

నీవింక నాకు దూరంబై పోతివా! హా! త్రిలోకపూజితా! హా? జగదేకప్రతాపా ద్రోణాచార్యా! (లేచి దుఃఖించుచుఁ బోయి కరదీపికచే వెదకుచు కృపునిం గాంచి పైబడి) హా! కృపాచార్యా? వీరరత్నమా! శౌర్యాంబోధీ! పురుషసింహా!

క. ఎక్కడఁజూచిననీవై
దిక్కులువీఁగంగనార్చి దివ్యశరాగ్నిన్
జక్కడఁచివైరిసంతతి
నొక్కటబాలిగలనిలోననొరిగితె! కృపుఁడా!

అయ్యో! ఎంతనిర్భాగ్యవంతుఁడనై చేతులారమిమ్మందర జంపించితిని. ఎంత దురాత్ముండను? హా! కృపా? దైవంబునకు నీమీఁద నెంతకృప దప్పిపోయె. (అని దుఃఖించుచులేచి కరదీపికచే వెదకుచుంబోయి యశ్వత్థామంజూచి పైఁబడి) హా? అశ్వత్థామా? హా! ద్రోణపుత్రా? జగద్వీరా! అపారశౌర్య ధైర్యపాథోనిధీ? మహాత్మా!

మ. సురసందోహముబెగ్గడిల్లసమరక్షోణిఁ బురారాతియుం
చరిబృందంబులుపర్వవెంటబడితీవ్రాస్త్రాగ్ని నక్షౌహిణుల్
ధరణిన్ గూల్చిననీప్రతాపమెటునిద్రంబోయెః నీతేజమే
సరణిన్ మగ్గెను! ద్రోణజా! భువనశశ్వత్పూర్ణశౌర్యోదయా.

(అని లేచి కరదీపికచే వెదకుచుంబోయి కర్ణునింగాంచి దుఃఖించుచుపైబడి) హా! కర్ణా! దినకరప్రతాపా! పరశురామశిష్యా? దివ్యశరకౌశలా? అంగరాజా! మహావీరశిరోమణీ?

క. మురహారునినెదురుకొనిదు
స్తరశస్త్రాస్త్రములనొడలుజల్లెడమైభీ
కరరక్తధారగురియఁగఁ
బరపియురణశయ్యనిద్రబడలితె! కర్ణా?

(అనికరదీపికచే వెదకుచు దుఃఖించుచు దుర్యోధనునింగాంచి పైఁబడి) హా? దుర్యోధనా? హాకురుకులవంశభూషణా! గదాప్రవీణా!

క. అరివీరులపైఁబడియెడ
లెఱుఁగకసైన్యంబుతోడ నెంతయుఁగూర్మిన్
నరుకొఱకై బడితివేః సం
గరమునదుర్యోధనాః యఖండితతేజాః

నిష్కారణంబుగ నామూలంబునగదా! నీకిట్టియవస్థకలిగినది హా! తమ్ముడా!

ఆ. వె. అలరుపాన్పు జేర్చునతిసుకుమారంపు
తనువుకఠినశిలలు జెనకనకట
కాకిగ్రద్దలెల్ల జీకాకుసేయంగ
దీర్ఘనిద్రనొందితివె? రణమున.

అయ్యో! ఇంకధృతరాష్ట్రు మోమెట్లుచూతును! గాంధారికేమందును! హా! సుయోధనా! (లేచిదుఃఖించుచు కరదీపికచే వెదకుచు) బాహ్లిక భూరిశ్రవాది వీరులారా! మార్తాండతేజులగు మత్స్యపాండ్య పాంచాల దేశాధిపతులారా నానిమిత్తమై ప్రాణంబులు వీరరణంబున కొప్పగించితిరా! అయ్యో! దైవమా! ఎంతనిర్దయుండవైతివి! (అనికరదీపికచే వెతకుచు భీమునింగాంచి బిగ్గరగానేడ్చుచు పైబడి) హా! సోదరా! భీమసేనా! హా! శతనాగబలా! హా! ధైర్యనిర్జిత కనకాద్రీ! హా! యగ్రజవాక్యపరిపాలనా! హా! తమ్ముడా!

సీ. మునుసుయోధనుడుగంగనుద్రోయదప్పించు
కొనికందకుండవచ్చినబలంబు
లక్కయింటిలోనేము చిక్కిచావకుండంగ
మోచికాపాడినభుజబలంబు
వనిలోహిడింబాసురునిబట్టిచంపిన
తక్షణమమ్ముగాచినదివ్యబలము
యేకచక్రపురంపుశోకంబువారింప
బకునిజంపినయట్టిబాహుబలము

గీ. యెందడంగెనుతమ్ముడాయెంతఘోర
కార్యమలవడె? హా! విధీ? కరుణమాలి
యెంతకార్యముబూనితివేమనందు
కుంతికేమనినేవిన్నవింతునకట?

అయ్యో! ఇంకేమున్నది? పాండవకులం బంతరించినది. తమ్ముడా! తమ్మి సా! చక్రమునన్నువిడచి నిన్నేలగ్రహించినదిరా? (మూర్ఛిల్లిలేచి గోలుగోలున నేడ్చుచు కరదీపికచే వెదకుచుబోయి నకులసహదేవులగాంచి పైబడి) హా! నకులసహదేవులారా! తమ్ములారా! రణంబుతీర్చి నారా!

క. సుకుమారులమిము ద్రుంపఁగ
ప్రకటక్రియ నెట్లు మనసువచ్చెను? మీ రెం
దుకు కలనబడిరి నేనే
టికి మిగిలితి మిమ్ము మ్రింగి దేవతలిర్వా.

(అని దుఃఖించుచు లేచి కరదీపికచే గొన్ని యడుగులు నడచి చతుర్థను కళేబరంబు గాంచి పైఁబడి) హా! చతుర్థనా! పాండవులు మహాబలశాలురనియు బలికి బొంకకని, నమ్మివచ్చినందుకు నిన్ను బ్రతికింపలేక పోయితిగదా, నీకొఱకై వీరులందఱు చక్రధారకు లోనైరిగదా! నీకా త్రిలోక సంచారమేలవచ్చె! ఆరంభనీకెక్కడ దాపరించె! నీవు మాకేల శరణార్థివైతివి! హా! విధీ! విధీ! (కొన్ని యడుగులు నడచి కరదీపికచే వెదకుచు దుఃఖంబుతో చూచుచు) హా! శల్య యుత్తమౌజయుధామన్యులారా! బంధులారా! శౌర్యనిధులారా! అర్జునుని నేమిచేసితిరి! అయ్యో! దైవమా! మాయందెంత నిర్దయుండవైతివి. (నడచి కరదీపికచేవెదకికొనుచు నర్జునుని కళేబరంబు గాంచి గోలుగోలున నేడ్చుచు పైఁబడి మూర్ఛిలిలేచి) హా? అర్జునా?

సీ. ద్రోణునకై మున్ను ద్రుపదు దెచ్చినబల్మి
నేడెచ్చటికి బోయె క్రీడిచెపుమ
యంగారపర్ణునినడచిననీశక్తి
నేడెచ్చటికి బోయెగ్రీడిచెపుమ
దారుణమత్స్యయంత్రం బేయువిలువిద్య
నేడెచ్చటికిబోయెగ్రీడిచెపుమ
ద్రౌపతికై నృపతతినోలుశౌర్యంబు
నేడెచ్చటికిబోయెగ్రీడిచెపుమ.

గీ. కలితగాండీవమున కేమికలిగెముప్పు?
పాశుపతబలమేమయ్యెపార్థ? దివిజ
రాజవరనందన? సుభద్రప్రాణనాథ!
పిల్చిననుపల్కవేమి రావిజయ నేడు!

(అర్జునునిశిరంబు దొడలపైనిడుకొని.)

మ. వనధిప్రావృతభూమి నేలుసురసర్వాశాధిపుల్మెచ్చ భూ
పనికాయంబులఁగూల్చునీతనిజయింపంజాలరే రెవ్వరం
చనుజ్యోతిష్కులువ్రాయ, నీకునిపుడేనూరేండ్లునున్ నిండునం
చనుకోలేదుర? స్వప్నమందయిన! కుఱ్ఱా! తమ్ముఁడా! యర్జునా.

(మోమునిమురుచు)

ఉ. అందఱికన్న నెక్కుడుగనారసి పెంచినకుంతితల్లికే
మందునురా! మఱందలుగుణాఢ్యసుభద్రకునిన్నుఁగూర్చియే
మందు? మురారిచక్రమునకక్కట! నిర్బలివైచి, వచ్చినా
నందునె? నాకుజావడరదాయెనికేగతి! కూర్మితమ్ముఁడా.

అయ్యో! నీపాలి యకాలమృత్యువుగా నీచతుర్థనుండెందుకుప్రాప్తించె? సహస్రజన్మములకైన నీవంటి తమ్ముఁడు దొరకునా? హా? కుంతీ! సాధ్వీ! నాతల్లీ! పుట్టినదాదిచింతయని యెఱుంగని నీకుగర్భంబులో నారని పెద్దచిచ్చు పెట్టితినిగదా! అమ్మా! ఎంతగట్టి జీవమో కాని నేనుమాత్రము ప్రాణంబుల విడువ జాలకున్నాను. (ఇటునటుజూచుచు) ఓ! భయంకర బీభత్స భేతాళాది భూతంబులారా! ఓభయంకర సృగాలతండంబులారా! నన్నుదినుఁడు. నన్నుమ్రింగుఁడు. హా! దైవమా! నన్ను దీసికొనిపొమ్ము.

(అనిదుఃఖించుచుండదూరంబుగా శ్రీకృష్ణబలరాములు ప్రవేశించుచున్నారు.)

బలరా-శ్రీకృష్ణా! సంగరభూమిపైబడియున్న సర్వసైన్యంబులం గలయంగనుంగొని వచ్చుచుండ, నెవ్వఁడో, చచ్చిపడియున్న, వారల పేరుపేరున బిలుచుచు నొక్కమృతకళేబరంబు దొడలపైనిడికొని యీయర్ధరాత్రి భూతభేతాళ సృగాల మహాభయంకరారావంబులతో డెక్కలేక, గరదీపికంగైకొని మోముల జూచుచు, దిక్కులు పిక్కటిల్ల దలమోదికొనుచు రోదనంబుసేయుచున్నాడు. అతండెవ్వఁడో! తెల్పుము.

కృష్ణ-హలాయుధా? ఉత్తమగుణవంతుండై, సత్యస్వరూపుండై, యజాతశత్రుండని పేరుగాంచిన కొంతిపెద్దచూలగు ధర్మరాజు తొడలపై నిడికొనిన శవకళేబరంబు త్రిలోకవీరుండగు నర్జునునిది. మనమిప్పుడమ్మహాత్మునిపరామరిశ జేసిదుఃఖంబుజల్లార్చి వత్తమురమ్ము.

బలరా-సోదరా! మంచిది. అట్లనే సేయుదము.

(శ్రీకృష్ణబలరాములిద్దఱు ధర్మరాజువద్దకు వచ్చుచున్నారు.)

ధర్మ—(దుఃఖంబుతో నర్జునుని కళేబరంబు కృష్ణునిపాదంబులపై బడవైచి తాను మీదబడి.)

ఉ. అమ్మను దుఃఖపెట్టికడునయ్యకుపిండము వేయకుండఁగ
దమ్ములఁద్రుంగి, బంధులనుదగ్రతఁగూల్చిన, నన్ను, నీవుచ
క్రమ్మునఁనొక్కవేళ్ళను కుగ్రక్కున ద్రుంచియు వారితో నక్షి
ఘ్రమ్ముగఁబంపవే? యఖిలప్రాణసముండనుమాటవిల్వవే.

క. తలపఁగఁబంచప్రాణం
బులతోఁదుల్యమైనశౌర్యమూర్తులనాత
మ్ములవిడచి బ్రతికి జీవం
బులదాల్చితినెట్టిపాపబుద్ధినొ? కృష్ణా!

ఉ. అందఱుజచ్చిపోయినరణావనినీనిశరాత్రి, నీశవ
బృందములన్విభీతమతినేడ్చుచు, రాజునకాత్మహత్యచే
యందమకింపఁగూడదనియచ్యుత? నీశితచక్రధారకై
పొందుగవేచియుంటి? వ్యథపోవఁగవోద్రోహినినన్ను ద్రుంచుమా.

(అనిదుఃఖించుచున్నాడు.)

కృష్ణు—(లేవనెత్తి విచారములో) ధర్మనందనా! దుఃఖింపకుము. [illegible] న మరణంబని, చేటులోఁబడునప్పుడే విధివిధించి యుంచును. చేసేది [illegible] టిమి. గతజలసేతు బంధనంబున గార్యంబులేదు. [illegible] ట్లు ధైర్యంబుదూల నింకేమున్నది. (కన్నీళ్లువిడుచుచున్నాడు.)

ధర్మ—(దుఃఖించుచు) శ్రీకృష్ణా! చూచితివా!

గీ. హంసతూలికపాన్పులనలరుచుండి
మంచిభోగంబులనుగాంచుమనుజపతుల
నక్కలేరీతిరొమ్ములుద్రక్కలించి
క్రిందబొరలించుచున్నవో! కృష్ణ! చూడు!

గీ. దిక్కుగల్గి దేవదేవునిదయలేక
కటకటనేలసమరధరణిశయ్య
నిద్రబోవురాజనికరంబుగన్గొన్న
గుండెపిగులకున్నె! కోమలాంగ.

క. వీకదయారహితుండవై
ప్రాకటభీమార్జునాదిబంధులనకటా?
మేకలనుద్రుంచుకైవడి
నీకెటుచేయాడె? ద్రుంపనీరజనేత్రా!

పోనిమ్ము. భీమార్జునాదులను, బంధుమిత్రులను, జంపెనంచు కంతదుఃఖింపఁగా శి, నేనేమో రక్షింతునని, నేనాడినమాట తప్పనని, నన్నునమ్మకొన్న శరణాగతుం డగు చతుర్థునని, నేనుబ్రతికియుండఁగానే నీచక్రంబున కప్పగించితిగదా యను కడుపు కోఁత చేత మరింతదుఃఖంబు వచ్చుచున్నది. (దుఃఖించుచున్నాడు.)

కృష్ణ—(తనలో) ఈధర్మనందనుని దీనవాక్యలు విన్నను, యీతని ధర్మంబుఁజూచి నను, రాయివలెనుండు, నామనంబు వెన్నవలె గరంగుచున్నది. (కన్నీళ్లు తుడుచుచు ప్రకాశముగా) యమనందనా దుఃఖింపకుము.

ఉ. ఇంతకుదైవనిర్ణయము నెవ్వరుదాటఁగలారు, నెమ్మదిఁ
జింతిలఁబోకు, సమ్మదము జెందితి, నేడనినీల్గినట్టిభూ
కాంతులలోననొక్కనికి గ్రక్కునప్రాణములిత్తుఁగోరు మో
యంతికపుత్ర! దిక్సముదయంబులుసాక్షిగనిప్డుసత్కృపన్.

ధర్మ—(చేతులుజోడించి) మహాత్మా? కృష్ణా! నీవు సాక్షాద్విష్ణుండవు. గాని కేవల మనుష్యమాత్రుండవుగావు. నీకు త్రిభువనంబుల నడ్డేమున్నది. లేకున్న ద్రిలో కంబుల మ్రింగజాలిన, భీష్మాదులను, నాతమ్ములను, గలనగన్నెత్తిచూడ నెవ్వరితరము. ఈపదునెనిమిది యక్షౌహిణులలో నొక్కనికిగదా! ప్రాణదా నంబుసేయుదునని వరంబిచ్చితివి. కావున.

తరళవృత్తము.—
ఘనతనేశరణార్థిగావఁగ కౌరవాదులతోడఁప
ద్దనిమిదక్షౌహిణులుకూలెను, దెప్పరంబుగనింద్రసం
దనుఁడునీతో నెవసికై కదనంబునంబడె, నాచతు
ర్థనునిప్రాణములిమ్ముచాలువరంబునాకిదె? కేశవా!

కృష్ణు—(ముక్కుపై వ్రేలిడుకొని తనలో) ఏమీ! ఈతని ధర్మము. ఏమి? ఈత
నిసత్యవాక్యపరిపాలన? (ప్రకాశముగా.)

చ. గురుఁడును భీష్ముఁడుం గృపుఁడు కుంభజసూనుఁడు, రాజరాజభా
స్కరసుతుఁడుం ఘటోత్కజుఁడు, గవ్వడిభీముఁడు మాద్రిపుత్త్రులుం
పురదియుపాండ్య కేకయులుమత్స్యనరేశ్వరులుండ నొక్కభూ
వరునకు ప్రాణమిచ్చెననుచుబల్కఁగనోరెటులాడె! ధర్మజా!

ధర్మ—యజ్ఞపూరుషా! కృష్ణా! (చతుర్థనుకళేబరంబు కృష్ణుని పాదంబులపై పడ
వైచి.)

ఉ. నన్ను నరక్తిబ్రోవుమని నాశరణంబును జొచ్చినట్టియా
పన్నునిగంటె? నీతనువు ప్రాణములెక్కుడుగాదు జూడనా
కన్నులు దమ్ములుం గొడుకులాప్తులు నెక్కువకారుగాన నో
పన్నగశాయి? యీనృపుని ప్రాణములిచ్చినఁ జాలు నాకుఁ గేల్.

ఆదియే నాకు విశ్వంభరాధిపత్యమిచ్చినట్లును, యెవ్వాకింబడయరాని బ్ర
హ్మపదంబొసంగినట్లును, సంతసించెదను. మఱియు. మాధవా!

క. శతవాజిపేయములుస
త్క్రతువులు దానంబులెట్టిధర్మక్రియలం
చితశరణాగతరక్షణ
కతిహీనములండ్రు యోగ్యులైనమునీంద్రుల్.

(ఆకాశవాణి) సత్యము. సత్యము. లోకంబున రాజులలోనెల్ల ధర్మరాజే
సత్యవంతుఁడు. సత్యవంతుఁడు.

(పుష్పవృష్టిగురియుచున్నది.)

కృష్ణు—(నవ్వుచు కౌగలించుకొని.)

ఉ. మెచ్చితినీసత్యసంధతకు మెచ్చితినీయుపకారబుద్ధికిన్
మెచ్చితినీగుణంబులకు, మెచ్చితినీశరణార్థిరక్షకున్
మెచ్చితినిన్ను నేఁడు ధరణీశునితో బ్రతికించినానని
జచ్చినసర్వసైన్యములసంతసమందుము ధర్మసంభవా!

(చూపుచు) అదిగో? నీవుకోరిన శరణార్థులోఁగూడ సర్వసైన్యంబు లెట్లులే చివచ్చుచున్నవో! చూడుము. నీకోర్కె నెరవేరినదిగదా? (అందఱులేచుచున్నారు)

(పుష్పవృష్టికురియుచున్నది.)

ధర్మ—(నమస్కరించుచు.)

క. ధరభారముడుపగానవ
తరణంబై నావుగానితలఁపముకుందా
పరమాత్మవుకేవలముగ
మురదానవప్రాణహరణ? భువనాధారా!

కృష్ణు—మహాత్మా? భీష్మాచార్యా! వరంబెద్దియైన గోరుకొనుము.

భీష్మ-(లేచివచ్చి చేతులుమోడ్చి)

దండకము.

శ్రీరామకౌస్తుభ కస్తూరివక్షాంకితా! ద్యన్మృదాభీల భూభృద్వనీహారితా! లస త్కాళినాగస్ఫటారంగ నృత్యక్రియారంజితా! గోపకీవల్లభా! వేణునాదప్రియా! చక్ర ధారీ! దయాంభోనిధీ! మానివ్యాద్యాంధ కారచ్ఛటోద్ధూత జ్ఞానప్రభాభాస్కరా! వాలఖిల్యాది యోగీంద్ర దేవేశ భూతేశ వాణీశులే నిన్ను సుజ్ఞానదీపంబుచేగాంచ లేరట్టి శ్రీదేవకీ నందనా! ముంజకేశా! ముకుందా! భవచ్ఛక్తివర్ణింప నేనెంతవాఁడన్ ప్రభో! తొల్లి కల్పాంతపువ్వేళ వేదస్మృతీచోరదైత్యారికిన్ మత్స్యకాయుండవై, క్షీరపాథోధిలో మందరాద్రిం భరింపంగ గూర్మంబవై, ఘోరహేమాక్షు దైత్యప్ర భున్ ద్రుంచగాబోత్రివై, భక్తప్రహ్లాదు గాపాడగా నారసింహుండవై, దేవవైరిన్ బలిన్వంచనన్ సేయగా వామనాఖ్యుండవై, యాజులం రాజులన్ జీల్పఁగా జామద గ్న్యుండవై, రావణుంగూల్ప, గౌసల్యపుత్రుండవై, దుష్టదైత్యాళినిం ద్రుంపగా రేవతీ ప్రాణనాథుండవై, యిప్డులీలామనుష్యస్వరూపంబునన్ బొల్చు! దామోదరా! కేశ వా! మాధవా! వాసుదేవా! భవద్భక్తుఁడన్ పెద్దవాఁడన్ బునర్జన్మలేకుండ నీసన్నిధిం జేర్చి కాపాడవే! శ్రీహరీ! సత్యభామ ప్రియా! విశ్వరూపా! చిదానందవర్తీ! నమ స్తేనమ స్తేనమః.

కృష్ణు—మహాత్మా! నీవుకోరిన వరంబిచ్చితి. చాల సంతసించినాఁడను. (చతుర్థునిం జూచి) చతుర్థనా! భీతిదక్కి నీపురంబునకరుగుము. (అర్జునుం గౌగలించు కొని) బావా! నేనిచ్చిన నిష్కారణశ్రమమన్నించి కొన్నిదినంబులు ద్వారక

మీ నాలోనిప్పుడు పయనంబుగమ్ము. ద్రోణాదివీరులారా! భవదీయ శౌర్యం బులకు జాల మెచ్చితి. మీరందఱు మీమీపురంబులకేగి సుఖంబుగనుండుడు.

(నారదుఁడు ప్రవేశించుచున్నాడు. అందఱు నమస్కరించుచున్నారు.)

నారదు—నారాయణ! నారాయణా!

చాలసంతసంబయ్యెడికృష్ణార్జునులకు వైరంబుగల్పించవలెనను
చిఱకాలవాంఛితముదీర్చికొంటిని. అర్జునా!
నీశౌర్యంబును, నీయన్నధర్మమునాచంద్రార్కమైయలరుఁగాత
మీశరణాగతరక్షణభూమిపై నిల్చునుగాత!
అందఱును సుఖంతురుగాత! (నిష్క్రమించుచున్నారు.)

మంగళం. మంగళం. మంగళం.

భరతవాక్యము.

ఉ. ఆరయరాజులెల్లశరణార్థులగాతురుగాతదీక్షతో
వారకకాలయుక్తముగవర్షముపాల్చుచుగాత! సౌఖ్యమ
వ్వారిగగల్గిమానవులువర్ధిలుచుందురుగాత! పంటవి
స్తారముకల్గిధర్మమునుదప్పకధారుణిగాలుగావుతన్.

గద్య

ఇది శ్రీమద్బృందావన పురీనివాస భోగేశ్వరేశ్వర కరుణాకటాక్ష
ప్రసాదితోభయ భాషాకవితా ధురంధరశ్రీ
తాళ్ళూరి భోగరాజకవీంద్రచతుర్థపుత్రక
సరసకవితావచోవిలాస వినుతగేయ

హనుమంతరాయ

ప్రణీతంబైన

విచిత్ర భారతంబను,

దృశ్యప్రబంధంబున సర్వంబును పంచమాంకము సంపూర్ణమ్.

శ్రీశోభనాద్రీశ్వరోవిజయతేతరామ్.

శ్రీరామార్పణమస్తు.



# తప్పొప్పుల పట్టిక.



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 20 | 18 | చైటపై | ఁబయ్యెదఁక |
| 22 | 12 | వయారి | యొయారి |
| 1 | 17 | శబ్ద | శబ్ధ |
|  | 25 | డలింగి | డులేచి |
| 27 | 12 | జేసె | సల్పె |
| 29 | 15 | వినినారలిట్లు | వింటిరోయిట్లు |
| 32 | 24 | దప్పనె | తప్పనే |
|  | 25 | మత్తకాసినీ | మత్తకాశినీ |
| 33 | 13 | గొల్లనికిఁ | గొల్లనికేఁ |
| 34 | 7 | బోర్నవవే | పోర్నవవే |
| 36 | 18 | కౌగలింప | ఁగౌఁగలింప |
| 39 | 1 | వన్నెలతో | వన్నియతో |
|  | 2 | తోడతో | తోఁడఁదో |
| 43 | 3 | ద్ర్యుంచి | ద్రుంచి |
|  | 5 | సాక్షీ | సాక్షి |
| 45 | 9 | మిత్రుడై | మిత్రుఁడు |
|  | 26 | గాళిలినాడ | కాళిలినాడ |
| 46 | 2 | చెయ్యి | చేయి |
|  | 27 | లేకనుతానుచేవ దరిగె | ఁజాలకనోడిపోయిపారె |
| 47 | 1 | స్వర్గాదిపుని | స్వర్గాధిపుని |
| 50 | 3 | గాచు | కాచు |
|  | 9 | చేత్య | చేఁద్య |
| 54 | 24 | హరికేగాదు | హరికింగాదు |
| 56 | 9 | గాని | కాని |
| 57 | 15 | యావ్వన | యావన |
| 65 | 26 | పెదిమి | పెదవి |
| 66 | 7 | గోరలు | గోఱలు |
| 69 | 26 | తడివెట్ట | తడివెట్టు |
|  | 27 | సింటికి | టింటికి |
| 70 | 4 | జనుమ | చనుమ |
| 76 | 1 | బంటువుబోలె | బంటుపగింది |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 78 | 19 | మరంది | మఱంది |
|  | 22 | యిప్పుడు... జూడ | యిపుడుకక్షసహింప |
| 83 | 1 | నివ్వ | ఓడువఁ |
|  | 2 | దలచమని | దలపమని |
|  | 8 | శబ్దంబూని | శబ్ధంబూని |
| 90 | 4 | బుద్ధులుగావు | బుద్ధులుమాని |
| 91 | 15 | ధర్మరాజునే | ధర్మసూతిమా |
|  | 16 | వెరవున... జూచెదు | ర్తురుషుదమంద నేమొగముతోఁగనుఁగొందువు |
| 94 | 11 | ర్వారత...లేచి | ర్వాకసక్రోధకాలఫణిచాడ్పునగద్దియడిగ్గి |
|  | 15 | మీరిటు | మీకిటు |
| 95 | 5 | లేనియెడల | నంచులేక |
| 103 | 3 | శ్రమంబందె | శ్రమఁజెందెఁ |
|  | 7 | వల్లనె | ఁబట్టియె |
|  | 16 | వల్లనె | ఁబట్టియె |
|  | 17 | వల్లనె | ఁబట్టియె |
|  | 23 | బూడిదె | బూడిద |
| 104 | 1 | ద్రుపదు...చూడ | ద్రుపదునిఁబట్టుట |
|  | 3 | మత్స్య...ద్రుంప | మత్స్యంబుఁద్రుంచుట |
|  | 5 | బెండ్లాడ | దెచ్చుట |
|  | 10 | గంధమలదినట్లు | గంధమలఁదినట్లు |
| 105 | 26 | యేద్పు...గలమె | హానిఁబుట్టింపఁగలమె |
|  | 27 | పౌరుషంబులుగల్గి | పౌరుషంబుండిన |
| 106 | 7 | మరది | మఱది |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | 8 | బాగెట్లు కాంతు రనఘు | గాబాసుకలుగు బెట్లు |
| 116 | 4 | జ్యోతిష్కులు | దైవజ్ఞులు |
| 118 | 14 | రాయునవలెసుండు | రాయునవలెనుండు |
| 119 | 10 | గాదుజూడ | కాదుచూడ |
| | 11 | గాకనో | కాకనో |
| 120 | 12 | నదీహూత్ర | నదీపతిహా |
| 121 | 15 | గాఢ్రు | కాఢ్రులు |

